# మదిరాదేవి

( నాటికల సంపుటి )

ఆచార్య కౌండిన్య భట్టర్
అట్లూరి వెంకట కృష్ణయ్య

సాహిత్యలతా గ్రంథమాల
గుంటూరు

రూ 1-12-0

# సాహిత్య లతా గ్రంథమాల

ప్రథమ ముద్రణము ... మార్చి 1953



సంపాదకులు :-

శ్రీమతి మద్దినేని అమృతాదేవి

గుంటూరు

నవభారతి ప్రింటింగ్ ప్రెస్, నరసరావుపేట.

# నా మాట

సాహిత్యలతా గ్రంథమాలద్వారా నా అరుణ కిరణ కళాసమితి ప్రజానీకానికి ప్రప్రథమంగా (ప్రథమ అరుణ కరణాల్ని) నా 'అగ్నిజ్వాల' సర్పించింది. ఈ మ ది రా దే వి నాసమితి రెండవకిరణము (మనోరచన) దీన్ని మీ రాదరిస్తారని భావిస్తా. విషాదం మానవహృదయాన్ని కదిపివేస్తుంది. (విషాదరచనలే ఉద్దేశ్యం నెరవేరుస్తాయి) ఈనాడు సాహిత్యలోకంలో ముఖ్యంగా నాటకరంగంలో విషాదసాహిత్యాలే ప్రజల్నెక్కువ ఆకర్షిస్తున్నవి. ఈ సంపుటియందలి మూడునాటికలు విషాదాంతాలే. ఎమెచ్యూర్ ఆర్టిస్టులకు నేను చెప్పదలచిందొక్కటేమాట. ఒకనాటకాన్ని ప్రదర్శించదలచినప్పుడు దాన్ని పూర్తిగా చదివి అర్థంచేసుకోవాలి. అంటే పాత్రలు, స్వభావాలు, రంగస్థలం, వేషధారణ వీటిని పరస్పర సమ్మేళనం చెయ్యాలి. అట్లా చేస్తే నాటకకళ ఉన్నతస్థాయి చేరుతుంది. కళాకారులు నాటకం మొట్టమొదటసారి పూర్తిగా చదవాలన్న ఉద్దేశ్యంతోనే పాత్ర స్వభావాలు ప్రదర్శనకు వలయుసామాగ్రి వేరుగా యివ్వలేదు, పాత్రలకు అనుగుణంగాని భాష, వేషధారణచేసి కళను ఖూనీజేయవద్దని ప్రార్థన. నేను సాహసించి ఒక కొత్తపంథా తొక్కాను. అసలది పాతపంథే. పూర్వ నాటకాల్లో సూత్రధారుడంటూ ఒకడుండేవాడు. అతడు నాట్యాచార్యుడన్నమాట. నాటకం ప్రారంభించేముందు సూత్రధారుడు ముఖపటముదగ్గరకు వచ్చి కవిని, నాటకాన్ని పరిచయం

చేస్తాడు. రాబోయ్యేపాత్రను పరిచయంచేస్తాడు. ఒకొక్కొక్క ప్పుడు నాటకభావాన్నికూడా ప్రజలముందు పెడ్తాడు. నేను సూత్రధారుని కథకుడు అనే క్రొత్తపేరుతో ప్రవేశపెడ్తున్నా.

(బలి విజయం నాటికల్లో)

ఇచట నాకథకునిపని పాత్ర పరిచయం జేయటంకాదు. తెరలో మనకు కనుపించని కథనంతా మాటలరూపంలో ప్రేక్షకులముందు పెడ్తాడు. ప్రేక్షకుల కండ్లముందు తెర ఎత్తగానే కనుపించేదృశ్యం, ఈవిధానంవల్ల క్రొత్తగా ప్రేక్షకులకు తోచదు. ఎందుకనగా వారంతకువఙందే కథలో కొంతవరకూ మునిగిపోయుంటారు. నేను జేసిన యీమార్పును అభ్యుదయ రచయితలు, కళాకారులు పాఠకులు మన్నిస్తారా!

## కృతజ్ఞత

నేను అడుగకుండానే ఈనాటికలసంపుటిలో తన ఉత్తమ నాటిక 'దేశద్రోహి'ని జేర్చి నా అరుణ కిరణ కళాసమితి సాహిత్యరంగంలో భాగంపంచుకొన్న అల్లూరి వెంకటక్రిష్ణయ్య (జలజశ్రీ)కి కృతజ్ఞత.

## పుష్పాంజలి

దినదిన పతనావస్థ నొందుచున్న ఆర్యజాతికి, ఆర్య సంస్కృతికి నూతనోత్తేజం కల్గించ నవతరించి ఆర్యసమాజాన్ని స్థాపించి, ఆర్యధర్మ స్థాపనకై బలమైన శ్రీ స్వామి దయానంద సరస్వతీ ఋష్యేంద్రుల పాదపద్మములకు భక్తి పూర్వకంగా—

ఆచార్యకౌండిన్యభట్టర్ అరుణ కిరణ కళాసమితి.

అరుణ కిరణ గ్రంథమాల

అరుణకిరణాలు. 2

# మదిరాదేవి

[నైజాం రాష్ట్రంలోని దోరేపల్లి (నల్లగొండజిల్లా)లో మస్తానమ్మ, మదార్ సాహెబ్ నేటికి దేవతలుగా కొలవబడుతూ తమ ప్రేమజీవితాన్ని వంశ మర్యాదలకు ఆహుతిచేసిన అమరజీవులకథ ఆధారంగా పేర్లమార్పుతో వ్రాయబడిన స్వేచ్ఛరచన.]

## పాత్రలు.

ధర్మారెడ్డి- ధర్మపురి జమీందార్

వీరభద్రారెడ్డి- వీరభద్రాపురం జమీందార్, ధర్మారెడ్డి పినతండ్రి కొడుకు

మదార్- ధర్మారెడ్డి సేనాని, మంత్రి

వెంకోజి- కోట కాపలాదార్

భటుడు-

మదిరాదేవి- ధర్మారెడ్డి భార్య

# 1వ దృశ్యం

(ధర్మపురి కోటలోని కచ్చేరీచావడి. ధర్మారెడ్డి కుర్చీపై కూర్చొనియుంటాడు — వయస్సు 30-35 మధ్య. అజాను బాహుడు. నిష్కల్మషహృదయ— ప్రక్కనున్న వేటకుక్కకు యేదో పెడ్తూంటాడు.)

(వీరభద్రారెడ్డి ప్రవేశిస్తాడు. 23-25 మధ్య వయస్సు దూకుడు. బలశాలి. ముఖం తీక్ష్ణత్వాన్ని ప్రకటించేదైనా యెందుకో కోపభావాలు కనబడుతుంటాయి)

ధర్మా— వీరభద్రా! కూర్చో!

వీర— (ప్రక్క కుర్చీలో కూర్చుని ఆలోచనతో చూస్తుంటాడు

ధర్మా—నీకోట చాలా బలిష్ఠమైంది. వీరభద్రాపురము ముందు యీ ధర్మపురి యేపాటిదీ!

వీర— నిశ్శబ్దంగా ధర్మారెడ్డి ముఖంవైపు చూస్తుంటాడు

ధర్మా—ఎందుకలా చూస్తావు ఇచటపరిస్థితులు నీకేంబాగాలేవా?

వీర— (కొద్ది తీవ్రంగా) ఆ! బాగాలేకేం. చాలాబాగున్నయ్

ధర్మా—నా పెంపుడుజంతువులను చూచావా! వాటికి నేనంటే ప్రాణం (దగ్గర కుక్కనుచూపి) ఎల్లప్పుడు నన్ను వదలి పోనంటాడే భైరవుడు. నేనంటే ఎంతప్రేమ దీనికి

వీర— మానవులపై జంతువులకే ప్రేమ. మానవులకు మానవులపై ప్రేమ లేదు. మానవహృదయాలు విషపూరితాలు

ధర్మా—వీరభద్రా! నీమనస్సు కేదో బాధగాయున్నట్లుంది

వీర—/ఏమి లేదు మహారాజా! ఇక్కడికి వచ్చినరోజు తూర్పు

బురుజుపై అర్ధరాత్రిసమయమున చూచిన ఒకదృశ్యం
నా హృదయ ప్రశాంతతను నిరంతరం భంగంచేస్తున్నది.
ఎంత మరచిపోదామన్నా మరపురావడంలేదు

ధర్మా-నిన్నింతగా బాధించు ఆ దృశ్యమేమిటో చెప్పరాదూ
వీర- చెప్పినంతమాత్రమున లాభములేదు. పైగా...
ధర్మా-పైగా...
వీర- (తలవంచుకొనును)
ధర్మా-చెప్పు వీరభద్రా! నీమనస్సును బాధించే ఆ దృశ్యమేదో
చెప్పూ!
వీర- చెప్పుటకు సమయమింకనూ రాలేదు మహారాజా
ధర్మా- నాకు చెప్పుటకుగూడ సమయమా
వీర- క్షమించండి మహారాజా! హృదయవ్యథ చెప్పిన తీరునది
కాదు. అది బలికోరుచున్నది. అది సామాన్యమగు బలి
కాదు. నరబలీ అందునా ఆప్తులబలి
ధర్మా-(నవ్వి) నీవ్యాకులము నేను గ్రహించినాను వీరభద్రా!
వీర- నిజంగా గ్రహించారా!
ధర్మా నిజంగా గ్రహించాను. చెప్పమంటావా!
వీర- చెప్పండి
ధర్మా-ఒక్క-యువతి తనభర్తను కాదని వేరొక యువకునితో
విహరిస్తున్నది
వీర- (తెచ్చికోలు ఆశ్చర్యంగా) ఎచట మహారాజా!
ధర్మా- (చిరునవ్వుగా) ఇచటనే నాధర్మపురి కోటలో ఆదృశ్యా
న్ని నీవు చూచివుంటావు. అది నీమనస్సుకు బాధకలిగించి

ఉంటుంది

వీర– బాధకలిగించిందంటూ రేం ప్రభూ! ఆపాపమ స్త్రీకం నన్ను నిలువునా దహించింది. నేనిప్పుడు బ్రతికున్నానా! మరి ణించానా! చెప్పండి

ధర్మా–(చిరునవ్వుతో) అంతగా నిన్ను బాధించిందేం ఆ ప్రణయ జీవుల స్వేచ్ఛావిహారం. ఆ అపరాధానికి కారణం నేనే.

వీర– కాదు కాదు ప్రభూ! రాణీ మదిరాదేవి

ధర్మా–నా మదీరా నిరపరాధి. ఆ అపరాధంనాదే నేచెప్పు విను. నన్ను ప్రేమించిందా లేదాఅని తెలుసుకోకుండానే రాజ్యమదంతో తోటి సామంతుని బిడ్డను వివాహమాడటం నాతప్పుగాక మరెవరది?

వీర– మదిరాదేవి మిమ్ముల మనసార ప్రేమించేవివాహమాడింది క్షమించండి. మదిరాదేవి నిరంకుశస్వేచ్ఛావిహార కాముక ప్రవృత్తిని గుర్తించలేక మీరు పూర్తిగా స్వేచ్ఛనిచ్చారు. ఆ స్వేచ్ఛాఫలితంగా మదిరాదేవి మదిరాపాన మత్త యైంది అంతేప్రభూ!

ధర్మా–పొరబడుతున్నావు వీరభద్రా! 18 ఏండ్ల కన్యమనస్సు 30 ఏండ్ల పురుషు నాకరింపజాలదు. ఆ లేతహృదయం నవయువకునికోసం వెదకితిరుగుతుంది. ఇది సృష్టిరహస్యం. నా మదిరా అంతే. ఈతప్పంతా నాదే.

వీర– (కోపంగా) ఇందులో మీ తప్పేమీలేదు. కామంతో మదిరాదేవి కన్నులు మూసుకపొయ్యాయి. నే నా ని మదార్ మత్తెక్కి తన్ను తాను మరచాడు. రెడ్డివంశ

మర్యాద నాశనమయింది. వంశకళంకం అంతమొందించి తీరాలి.

శర్మ- వద్దు వీరభద్రా! మదిరా మదార్ లు ప్రేమజీవులు వారిని చంపవద్దు. వారి రహస్య ప్రవర్తన నాకు దాసీలమూలంగా తెలిసింది. వారిద్దరి పవిత్ర ప్రేమకు అంతరాయం కలిగించడానికి నామనస్సు అంగీకరించలేదు. అందుచే రాజీనామాకి బోవడమే మానివేశాను

వీర- నీవు త్యాగమూర్తివి ప్రభూ! మదార్ రాజద్రోహి మదార్! నీ అంతు తేల్చకపోతే నే రెడ్డివీరుణ్ణే కాదు

శర్మ- తొందరపడుతున్నావు వీరభద్రా బాగా ఆలోచించి చూడు, ఇందులో మదార్ తప్పేముంది

వీర- నీబోటి శాంతమూర్తులకు, త్యాగశీలురకు ఘోర అపరాధికూడ, నిరపరాధిగాకనబడతాడు. కాని వంశమర్యాద నాశనమైపోతుంటే నే చూస్తూ వూరుకోలేను. వంశ మర్యాదకోసం మదిరా మదార్ లను బలి చేసితీర్తాను

శర్మ- వీల్లేదు. నీవుచెప్పేది అధర్మం. ఇందూ మదార్ తప్పులేదు మదిరాతప్పులేదు అదంతా కాలవిధి. దాన్ని ఆపడం నీతరమా, నాతరమా! మన పరువు మర్యాదలకోసం సాటి ప్రాణుల హింసించడం నీచం. చేతనైతే వారిమనస్సులు మార్చేందుకు ప్రయత్నించు, నే సంతోషిస్తాను. మానవులమనస్సులు మార్చలేక హత్యచేయడం నీచాతినీచం

వీర- ఎంతటి నీచమైనాసరే వంశమర్యాదకోసం చేస్తాను. నా

ప్రాణాన్నయినా యిస్తాను. మదిరా విశృంఖల వర్తన సహింపరానిది

ధర్మా- నీమనస్సు కఠినం—వీరభద్రా! నామాటవిను

వీర- శాల్యమాదిగా మీమాట కెదురాడలేదు కాని ఇది అనివార్యము. క్షమించండి. సెలవు. (లేచిపోబోవును)

ధర్మా- పోవద్దు వీరభద్రా! కూర్చో!

వీర— (కూర్చొని ఆలోచనతో చూచుచుండును)

(మదార్ ప్రవేశము) (మదార్ అజానుబాహుడు, సర్వాంగసుందర విగ్రహం 20-25 మధ్య వయస్సు. రక్తాలు చిక్కిన ఖడ్గం సదా ముఖు వేలాడుతూంటుంది)

మదా- సలాం ప్రభూ!

ధర్మా- మదార్! మన చేజిక్కిన ద్రోహిశిగుంపుకు యేంశిక్ష విధించావ్

మదా - మరణదండన విధించా ప్రభూ!

ధర్మా- మరణదండనా! దండనీతి యెంతదారుణం. అపరాధులు శిక్షింపబడ్డారా

మదా- లేదు ప్రభూ! తమ ఉత్తర్వుకోసం వచ్చాను

ధర్మా- మరణదండన ఆపుచేయ్. వారిమనసు మారేవరకు కారాగారశిక్ష విధించు

మదా- చిత్తం

ధర్మా- (చిరునవ్వుతో) నీవు విధించదలచిన శిక్ష రద్దుచేశానని చికాకుపడకు. దయ మానవజీవితానికి ముఖ్యం

వీర- దయ మానవునికి ముఖ్యమేకావచ్చు, రాజద్రోహుల

దండించేవిషయంలో కూడా దయా! ఏమంటావు మదార్

మదా- (నిర్వారపడి) చిత్తం

వీర- మదార్, రాజహృదయ శాంతికి భంగం కలిగించడం కూడా రాజద్రోహం కదూ?

మదా- అవును ప్రభూ!

వీర- అట్టి ద్రోహికి యెట్టి శిక్ష విధించాలి

మదా- వెంటనే మరణదండన

వీర- అట్టి ద్రోహులు ధర్మపురి కోటలోనే వున్నారని నీకు తెలుసా మదార్

మదా- ధర్మప్రభూ! ధర్మారెడ్డి పరిపాలనలో రాజద్రోహులు కూడానా?

వీర- మేకవన్నె పులులను గుర్తించడం సులభమా మదార్

మదా- (ఆలోచనతో) ప్రభులు చెప్పేదినాకు అర్థము కావటము లేదు

వీర- ఎందుకర్థమవుతుంది. ఈక త్రిరుచిచూపిస్తే నీకంతా అర్థమవుతుంది

ధర్మా- వీరభద్రా!

వీర- ప్రభువులు యీ విషయంలో జోక్యం కలిగించుకోవద్దని ప్రార్థన

ధర్మా- ఇక నీవు మదారుతో యేం మాట్లాడటానికి వీల్లేదు వీరభద్రా

వీర- ఈ అత్యాచారం జరిగితీరాలిసిందేనంటారు

ధర్మా- నా ఆంతరంగిక విషయాలలో నీకు జోక్యం అనవసరం వీరభద్రా

వీర- చిత్తం మహారాజా! (దుఃఖం రోషంతో కూడిన స్వరంతో) ఒక్క మనవి. ఈ మదారు మేకవన్నె పులి. దీనిని నమ్మకండి. (ఆగి) మీ ప్రాణాలకే— అబ్బా!— శెలవు. వెళ్ళివస్తాను. (వెళ్ళిపోవుచుండును)

ధర్మా- వీరభద్రా! వీరభద్రా!

(వీరభద్రుడు వెళ్ళును)

ధర్మా- అబ్బా! మూఁ ఫూఁ...

మదా- ఎందుకిలా బాధపడ్తారు ప్రభూ!

ధర్మా- మదారు వీరభద్రుడన్న మాటలకు చిన్నపుచ్చుకోకు. నా జమీకి సేనానివి, మంత్రివి నీవేగా. నా అంతరంగి వాడవు నీవు

మదా- ఎంతమాట. నే ప్రభు సేవకుడను

ధర్మా- ఇక నీవు వెళ్ళుమదారు

మదా- చిత్తం సలాం ప్రభు (వెళ్ళును)

ధర్మా- అబ్బా! మదిరా నీ జీవితానికి తీరని కళంకం కలిగించిన ద్రోహిని. వీరభద్రుడు పట్టుదలమనిషి. మ ది రా మదారులను బలిగొనితీరుతాడు. అది జరగకుండా నా శాయశక్తుల ప్రయత్నిస్తాను.

భటుడు- (ప్రవేశించి) భోజనానికి లేవండిప్రభూ

ధర్మా- మదిరా!—మదారు— (కాసేపు దీర్ఘంగా ఆకాశం వైపు చూచి) వీరభద్రా! ప్రేమజీవుల బలిగొనకు.

(వెళ్ళును)

తెరపడును.

## 2వ దృశ్యం

కోట తూర్పుబురుజుపై మదిరాదేవి కూర్చొని యుంటుంది. మదిరా అంత రూపసి కాకపోయినా అందవికారి కాదు. ఎట్టి పురుషునైనా ఆకర్షించగల శక్తి ఉంది ఆముఖంలో. 18 సం॥ వయస్సు

మది- (లేచి నిలబడి) మదార్! (అని కేకవేయును)

(తెరలో) మదిరా! వస్తున్నా (అని మదారుప్రవేశించును)

మది- అర్ధరాత్రి దాటింది. ఈవేళయింత ఆలస్యంచేశావేం మదారు

మదా- రాజకార్యాల్లో మునిగిపోయాన్ రాణీ. ఎన్నిపనులున్నా రాణిని మరువగలనా!

మది- ఆ! నిజంగా!

మదా- మదిరాదేవిగారు యేమిచేయమన్నా చేస్తాను. నిప్పులో దూకమన్నా దూకుతాను

మది- అబ్బా అంతమాటనకు

మదా- దేవిగారికోర్కె నెరవేర్చడానికి యీరోజు యేర్పాటు చేశాను.

మది- ఏమికోర్కె

మదా- మీకోర్కె నాకుతెలుసు దేవీ—రేపు సూర్యోదయానికి ధర్మపురికి జమీందారిణి మదిరాదేవి

మది- నిజంగా

మదా- నిజంగా రాణీ

మది- అసంభవము

మదా- సంభవమే. అయేర్పాటంతా నేచేశాను

మది- ఏంచేశావో చెప్పవూ

మదా- విూకు చెప్పకుండా చేసినందుకు క్షమించండి. ఇప్పుడు మనవిచేస్తాను (తగిపోవును)

మది- చెప్పుమదాన్ సందేహిస్తావేమి

మదా- నే చెప్పబోయ్యేవిషయం రాణిగారికి తాత్కాలికంగా బాధకలిగిస్తుందేమో

మది- ఫరవాలేదు చెప్పు ధర్మపురికి మదిరాదేవి జవిూందారిణి కావటానికి ......

మదా- ఒక్కరేఅడ్డు ఉండేది

మది- ఎవరా అడ్డు

మదా- ప్రభువు

మది- ఐతే ఆయన్నేంచెయ్యదల్చావ్

మదా- ప్రభువులాంటి ధర్మాత్ములకు యీలోకంలో స్థానంలేదు

మది- అమాయకుడైన మహారాజును చంపావా?

మదా- నా మదిరాదేవిగారికోసంచేశా. ధర్మారెడ్డి నాప్రభువే. కాని మదిర నా ప్రాణం!

మది- మన స్వార్థంకోసం ఆ త్యాగశీలుని బలిచేయవద్దు మదాన్ ఇది నీ ప్రియురాలి ప్రార్థన

మదా- దేవీ క్షమించండి మహారాజు భోజనంజరిగి రెండుజాములయింది. ధర్మప్రభువులు స్వర్గానికి వెళ్ళేవుంటారు

మది— ఆ ... ...

మదా— రాణీ నేరాజద్రోహంచేశా. నీవు జమీందారిణికాగానే శిక్షించు

మది— నిన్నా నేశిక్షించేది. నీవు నా జీవితసర్వస్వం. నామకార్థమే జమీందారిణి. సర్వాధికారివి నీవే. కాని మన స్వార్థంకోసం అమాయకుణ్ణి బలిచ్చేశామే అని నాచింత

మదా— అంతేనా లేక నీభర్తను చంపానని బాధపడుతున్నావా?

మది— నాభర్త ధర్మారెడ్డికాదు నీవే. స్త్రీ ఎవరిని ప్రేమిస్తుందో వాడే ఆస్త్రీకి భర్త. వచ్చేజన్మలో నేను నీకు ధర్మపత్ని కావాలని కోరుతున్నా

మదా— (చిరునవ్వుగా) మదిరాదేవి జమీందారిణిగారు. కోటలోకి వేంచేయండి

మది— (నవ్వును)

మదా— పోదాంరండి రాణీ వీరభద్రారెడ్డికి యీ కుట్రసంగతి తెలియకుండాచెయ్యాలి. వీరభద్రారెడ్డి త్రాచుపాము. అతన్ని కనిపెట్టి మనం మెలగాలి రాణీ

మది— వీరభద్రారెడ్డి మధ్యాహ్నమే వీరభద్రాపురం వెళ్ళాడు

మదా— కాని యీవార్తవిని వారు తిరిగిరావచ్చు. రాణీగారు వారితో జాగ్రత్తగా మెలగాలని ప్రార్థిస్తాను

మది— ప్రార్థన దేనికి. శాసిస్తున్నానని చెప్పు

మదా— మీరు రాణీవాసానికి వెళ్ళండి. నేను రాజుగారిమహల్ కు వెళ్తున్నాను

మది— మదాన్! ఇక మన ప్రేమలతకు అడ్డులేదు. స్వేచ్ఛగా

అల్లుకోవచ్చు, పుష్పించవచ్చు, ఫలించవచ్చు.

(దూరంగా గుడ్లగూబ అరుపు వినబడుతుంది)

మది- గూబ అరిచింది, నా హృదయానికేదో అనుమానంగా
భయంగా ఉందిమదాన్! తొందరగా వెళ్ళాలిరా, వీర
భద్రారెడ్డి వచ్చాడేమో. (వెళ్ళెదరు)

తెర పడును

—0—

## 3వ దృశ్యం

(రాజమహల్ వీరభద్రారెడ్డి ప్రవేశించి కోపంతో తార్లాడుతుంటాడు.)

వీర- మదాన్ నా అన్నను నీవు కబళించితీర్చావని నాకు తెలుసు
నీవంతపనీ చేశావు. ఎవరక్కడ

(తెరలో మదిర) నేనే వీరభద్రా.

వీర- రాణీగారా!

మది- బయటికివచ్చి కుర్చీలో కూర్చొంటుంది

వీర- రాణీగారి మనస్సు యీ అఘాతం

మది- పెద్దదెబ్బ. హృదయం బద్దలై పోయింది, నేను బ్రతికీల
కేంచెయ్యాలి

వీర-ఇంతమాత్రానికి కలతపడకండి. మా అన్నగారు ధర్మాత్ములు.

వారు ఈ ప్రపంచానికి తగరు, ఇంతకు హత్యను గురించి మీ ఉద్దేశ్యం

మది- నామనస్సంతా వికాకుగాఉంది. ఈహత్య విచారించే భారం నీదే వీరభద్రా

వీర- ఊ ...

మది- నా జీవితసర్వస్వం నాశనమయింది. ఇక ఈప్రపంచంలో నేనేంచెయ్యాలి. అబ్బా! నాప్రభూ! (రెండుచేతులతో కళ్లుమూసుకొని ఏడ్చును)

వీర- మీరీవిధంగా వ్యాకులపడి మాఅన్నగారి మరణంతో బలహీనమైన రాజ్యాన్ని మరీ బలహీనంచేయకండి!

మది- వీరభద్రా! నీవు నన్నాజ్ఞాపించు. నాకు కర్తవ్యాన్ని బోధించు

వీర- నాకా బాధ్యతవద్దు. మా అన్నగారి కుడిభుజం మదార్ వున్నాడు అతనిసలహా అందరికీ మంచిది.

మది- మదార్ మన క్రిందివాడు సేనాపతి, మంత్రి. నీవో యీ రాజ్యానికివారసుడవు. నీబాధ్యతగొప్పది. కాకపోయినా యిక రాజ్యం నీదేగా

వీర- కాదురాణీ—— అన్నగారి మరణంతో తపించే నా హృదయానికి సూలాల్లా నాటుతున్నయ్-నాకు రాజ్యదాహం లేదు.

మది- నామాట అపార్థంచేసుకోకు వీరభద్రా! నా ప్రభువులేని రాజ్యం నాకుదేనికి. నేను కాశీకివెళ్తున్నాను. ఇక యీ రాజ్యసంరక్షకుడవు నీవే

వీర- నాకాబాధ్యత వద్దు. ధర్మారెడ్డియెక్కిన గద్దె నేనెక్కడాని కర్హుణ్ణిగాదు. క్షమించండి దానికి మీరే తగినవారు

మది- నేనా! నాకాశక్తిలేదు. నా భర్తమరణం నన్ను జీవచ్ఛవాన్ని చేసింది

వీర- ఊరడిల్లండి రాణీ. నా అన్నను చంపిన ద్రోహికోసం దశదిశలూ గాలిస్తాను. పట్టి చిత్రవధచేస్తాను

మది- అపరాధి నిరపరాధిలాగే ఉంటాడు. గుర్తించడం కష్టం వీరభద్రా

వీర- అవును, నిజమే. అపరాధి నిరపరాధిలాగే కనిపిస్తాడు. ధర్మపన్నాలు వల్లిస్తాడు. తనసుఖంకోసం తన్నునమ్మిన వారిని నాశనంచేస్తాడు. ఎవ్వరు కనుక్కునేవారు లేరని విర్రవీగుతాడు. కాని సత్యం బయలుపడి తీరుతుంది

మది- నేనూ అనేదదే వీరభద్రా. సత్యం తప్పక బయలుపడి తీరుతుంది

వీర- రాణీగారిమాటల్లో యేదో ధ్వనిస్తుంది. అపరాధిని నేనని అపోహపడుతున్నట్లున్నారు.

మది- నాకా ఉద్దేశ్యంలేదు. కాని కోటలోనివారంతా మీరేనని అనుమానిస్తున్నారు

వీర- నేనా! నాసోదరుణ్ణి నేచంపానా! రాణీ!ఇదిమీరునమ్మారా?

మదా- (ప్రవేశం)

మది- హంతకుడు చిక్కాడా మదార్

మదా- నే చెప్పవలసినందుకు క్షమించండి రాణీ. వీరభద్రా రెడ్డిగారే ద్రోహిఅని కోటలోవదంతి. అందుచేత వీరభద్రా

రెడ్డిగారిని ఖైదుచెయ్యక తప్పదు.

సిరి- (కత్తితీసి) ద్రోహిని నేకాదు. నీవేమదార్, నన్ను బంధిం చగలవారు ఈ ధర్మపురికోటలో లేరు. పాపము చాలా కాలము దాగదు మదార్. నీకు కామం కళ్ళకెక్కింది. దానికితోడుగా రాజ్యదాహం రేగింది. నీవు, రాణికలసి న్యాయమూ ప్రియమైన నాఅన్నను బలిగొన్నారు. మదార్! భోజనంలో విషం పెట్టి రాజును చంపింది నీవు కదూ! బురుజుపై కూర్చున్న మదిరకు భర్త మరణవార్త చల్లగాచెప్పి నిన్నేమంటుందో అనే భయంతో జమీం దారిణివని పొగిడిందినీవుకాదూ. మీయిరువురిజీవితాలు నాఖడ్గానికి బలిఅయ్యేవరకు నేనిద్రించను. మదిరా! జమీందారిణియ్యానని కలుకుతున్నావు. మదార్ నీ రాజ్యదాహము అంత మొందిస్తాను

మది- వీరభద్రారెడ్డికి అన్న మరణంతో పిచ్చిరేగింది. తగుశిక్ష చేయించు మదార్

సిరి- (నవ్వి) నన్ను ధర్మపురికోటలో బంధించడం నీతరంకాదు మదారు. నా అంగరక్షకులు నీ కోటనిండా ఉన్నారు. నీవు నన్నేమీ చెయ్యలేవు. నా అన్న మరణానికి ప్రతీ కారం చేసి తీరుతాను___మదార్!- మదిరా! జాగ్రత్త

(వెళ్ళును)

మద్దా- వీరభద్రారెడ్డి త్రాచుపాము. పగపట్టాడు.

మది- కావచ్చు- మదారు తల్చుకుంటే ఆత్రాచు తల చితక కొట్టగలడు

మదా- కొట్టగలను కాని కష్టసాధ్యము. మన సంగతంతా
యితనికెలా తెల్సిందో. (ఆలోచించిచూచి) నాకు కొం-
టినుండి కోట కాపలావారు వెంకోజీపై అనుమానం-
గానుంది.

మది- వెంకోజీని పరీక్షించు. నయానా భయానా అతాలాగు
చెప్పకపోతే చిత్రహింసపాలు చేస్తానని!

మదా- ఎవర్రాఅక్కడ

భటుడు- (ప్రవేశించి) దొరా...

మదా- బురుజు కాపలా వెంకోజీని పిల్చుకరా

భటు- చిత్తం (వెళ్ళును)

మదా- మన ప్రణయలత కడ్డొచ్చిన ప్రతిపక్షులను నాశనంచే-
స్తాను. మనకోట ఒక స్వర్గసీమ. ఆసీమలో అప్సరసవు
నీవు.

(వెంకోజీ ప్రవేశిస్తాడు) (ఆజానుబాహుడు 40 సం॥ల
వయస్సు. కాని ఎందరినైనా ఎదుర్కొనగల క్షేమా కలవాడు.
చేతిలో బరిసెఉంటుంది)

వెంకో- రాణీగారికి నమస్కారము

మది- నీవు ప్రభువిశ్వాసపాత్రుడవు ప్రభువంటే నీకెంతప్రాణం
ఎవరో ద్రోహులు ప్రభువునుహత్యచేశారు. ఆద్రోహిని
గుర్తించి శిక్షించేభారం నీదే

వెంకో- నా ప్రభువును చంపిన ద్రోహిని గాలించి చిత్రవధ
చేస్తాను.

మదా- నీ వంతటివాడవే. కాని కోటలోనివారెవరితో యీ

హత్యను వీరభద్రారెడ్డికే సంబంధముందని నమ్మకం
వెంకో- అదంతా అబద్దం వీరభద్రారెడ్డి నిర్దోషి
మది- కావచ్చు కాని నేరము ఋజువుకాకముందే అనుమానించినంతమాత్రాన పారిపోయ్యాడు. పైగా నన్ను చంపుతానన్నాడు
వెంకో- మిమ్మలనా
మది- ఆ నన్నే కాని
వెంకో- చెప్పండికాని
మది- మరేమీలేదు. వీరభద్రారెడ్డి నీకు ఆబాల్యమిత్రుడు. నీకు తెలియకుండా యేపనీ చేయడు. ఈహత్య వీరభద్రారెడ్డి చేశాడని నీకు తెలుసునని నానమ్మకం
వెంకో- రామ రామ అన్యాయం. వీరభద్రారెడ్డి ఈపనిచెయ్యలేదని నాకు తెలుసు
మదా- నీకంతా తెలియునని నాకు తెలుసు. నీయింట్లో నీచెంత కూడా ఉందని నాకు తెలుసు
వెంకో- నాప్రభువుకు నేనాచరించింది పొరబడుతున్నారు
మది- పొరబాటుగాదు నగ్నసత్యం వెంకోజీ! అన్యాయందాగదు కప్పిపుచ్చకు
వెంకో- నిజమేకాని అన్యాయం, అధర్మం. కప్పిపుచ్చలన్నా యెంతోకాలందాగావు
మదా- అప్పుడు అందాక నీవు కారాగారంలో మగ్గాలిసిందే
వెంకో- (చిరునవ్వుతో) నన్ను బంధిస్తారా!
మదా- తప్పక ఎవర్రా అక్కడ

సేవకుడు- (ప్రవేశించి) ప్రభూ

మదా- కొత్వాలును పిలిపించి వెంకోజీని జైలులో పెట్టమని రాణీగారి ఆజ్ఞ అనిచెప్పుము

భటు- చిత్తం (వెళ్ళును)

వీర- (ప్రవేశించి) వెంకోజీని బంధించడం మీ తరంగాదు. ఈవీర భద్రారెడ్డి చేతిలోఖడ్గముండగా నన్ను నాఅన్నను నమ్మినవారు యెన్నటికినీ మీచేతికిచిక్కరు. మదార్! వంటలవాడు లక్ష్మన్నచేత రాజుగారికి విషంపెట్టించింది నీవేనని నాకుతెలుసు. లక్ష్మన్న నాకత్తి కాహుతయ్యాడు నీవూ అంతే

వెంకో, వీర- (వెళ్ళుదురు)

మది- కోటలోనే దాగి ఇంతనాటక మాడుతుంటే నీవేమిచేస్తున్నావు మదార్

మదా- వెళ్లి వాండ్లు కోటదాటకముందే బలిఅయ్యేలాచూస్తా నురాణీ. ఈ మదార్ నెదిరించా వీళ్ళు బ్రతికేది. వీర భద్రారెడ్డి తల నీకు కానుకగాయిస్తాను. (వెళ్ళును)

మది- వీరభద్రా నాపై యెందుకు నీకీపగ. ఇష్టంలేనిపురుషుని తో యేస్త్రీయైనను సుఖించగలదా. నీవు నన్నుకోరితే మాత్రం కాదంటానా— పొరపాటు. వీరభద్రారెడ్డి తల నాకు మదార్ కానుకగా యిస్తాడు—వీరభద్రా! నీ తల నాకు కానుకగా యిచ్చేవారికే యీరాజ్యాన్నిస్తా నని ప్రకటిస్తాను. నీది తాచుపాము పగ. నేనునాగసర్పము

స్వాదే పాములవానిని (నవ్వించుచుండును)

తెర పడును

4వ దృశ్యం

(కోట తూర్పుబురుజు. వీరభద్రా రెడ్డి వెంకోజి ప్రవేశిస్తారు. ఇద్దరివద్ద బరిసెలుంటాయి. సమయం అర్ధరాత్రి)

(తెర లో)

మది– మదార్!

మదా– మదిరా!

మది. నాకేదో భయంగావుంది మదార్,

మదార్– భయందేనికి ఈ తుపాకి నీచేతిలో ఉండగా నీకేమీ భయంలేదు కోటతలుపులన్నీ సంధ్యాకాలానకే మూసే యేర్పాటుచేశాను. మనకోటలో చీమకు సందులేదు. స్వేచ్ఛగా విహరిద్దాం

మది– నాకేదో అనుమానంగా భయంగాఉంది.

(గూబ మరల రెండుమూడుసార్లు అరచును)

మది– ఆ బురుజుపై గూబ తెగఅరుస్తున్నది. నా హృదయం కంపించిపోతున్నది.

మదా– భయపడకు రాణీ! ధైర్యశాలురను యెవరు యేంచేయ

లేరు. ఏది ఒక్కపాట పాడు రాణీ!

మది- ఏంపాట పాడేది

(తెర లేచును)

నర- మృత్యుగీతిక — (చిన్నస్వరంతో) వెంకోజీ నీవు అ ప్రక్కగా వెళ్ళి ఆతుపాకి మాదార్ చేతినుండి ఎగరగొట్టు నేను యెదురుగావచ్చి ఇదువ్వురిని ఒకసారిగా పొడుస్తాను.

వెంకో. (వెళ్ళును)

నర- నా సోదరహత్యకు ప్రతీకారంచేస్తాను. రెడ్డివంశ గౌరవాన్ని నిలబెట్తాను (ఒకప్రక్కగా వెళ్ళును)

(తెర లో)

(తుపాకి ఎగిరిపడ్డధ్వని. అబ్బాఅన్న రెండుఅరుపులు)

(తెర వెలుపల)

(గుండెలనుండి నెత్తురు కారుతూ మదార్, మదిరా ప్రవేశము.)

మది- అబ్బ! ఎవరు నన్ను బలిగొన్నారు

మదా- మదిరా! నే తూలిపోతున్నాను ఇలా దగ్గరికిరా. ఇదే మన కడసారి కౌగిలింత

మది- వెచ్చని నెత్తురు ప్రవహిస్తున్నది. ఈ రక్తంతోనే పెన వేసుకపోదాం — మదార్! (తూలిపడును)

నర- (ప్రవేశించి) మదార్! (నవ్వి) ఇకనైనా చెప్పు. రాజును చంపింది నివేకదా

మదార్- (సడమూలమీద లేచి) ఆ. మదిరా!

మది- మదార్! దగ్గరకురా!

వీర– (మదార్ జరుగుచుండగా బరిసెత్తో పొడిచి నవ్వుచు)
ఇది ఆఖరి బరిసెపోటు

మదా. ఆ (అని ప్రాణమువిడుచును)

మది– వీరభద్రా! మనుష్యుల చంపి నీవేం పొందుతున్నావు
ఈరాజ్యంకోసమే నీవీపని చేశావు

వీర– కాదు రెడ్డివీరుల వంశమర్యాద మంటగలిపి మదార్‌తో
కులికే కులటపెత్తనాన్ని మంటకలిపాను. వంశగౌరవాన్ని
కాపాడాను. నా సోదరహత్యకు ప్రతీకారంచేశాను
(మదారునుచూపుతూ) ఆరాక్షసుడు నీవు కలిసి కత్తి
త్మడగు నా అన్నను బలిగొన్నారు

మది– (బాధతో) అబ్బ! మదారు _ వీరభద్రా! నేను నీవం
శాన్ని సర్వనాశనముచేస్తాను. నేచస్తే నీకళంకం పోయిం
దనుకున్నావేం.మా ప్రేమజంటను నీవుఆరాధించు లేదా
నీవు నీవంశం సర్వనాశనమౌతుంది. అబ్బ! మదార్!
(పడిపోవును)

వీర– (వికటంగా నవ్వుతూ) వంశగౌరవం కాపాడాను. సోదర
హత్యకు ప్రతీకారంచేశాను. నా వంశం నాశనమైనాసరే
(నవ్వుచుండును)

వెంకో– నా ప్రభుఋణం తీర్చుకన్నాను. (నవ్వుచుండును)

తెర పడును

—o—

# దండక

[రామాయణము ఆధారముగా వ్రాయబడిన నాటిక]

ఉద్దేశ్యము:- ఆర్యజాతి, అనార్యజాతి ఏకజాతే. వారి వర్తనలే వారిని వేరు చేసినవి.

తమ అభిప్రాయాలకోసం:- ధర్మంకాని, అధర్మంకాని — సర్వస్వాన్ని త్యజించే త్యాగమూర్తుల పేర్లు చిరస్థాయిగా వుండితీరును—ఆవ్యక్తి నశించినా పేరు అమరత్వం చెందుతుంది.

—రచయిత

## పాత్రలు

దండకుడు- ఇక్ష్వాకుపుత్రుడు

అశోకుడు- ఇక్ష్వాకు సైన్యాధిపతి

క్రౌంచుడు- అనార్యుడు. దండకుని అనుచరుడు

అరజ- శుక్రుని పుత్రిక. యువ్వని, విలాసిని

విహాసుడు- భటుడు

సైనికులు- భటులు వచ్చెదరు.

# 1వ దృశ్యం

(రాజమహలు. ఇక్ష్వాకుపుత్రుండు, దండకుడు పచారు
చేయుచుండును.)

దండకుడు- యీ ఆర్యరుషు లెంతవంచకులు. ప్రజకు సర్వస్వాతం
త్ర్యముకలిగించు నన్ను ధర్మద్రోహియని తీర్మానించి
నారు. వారిఆర్యధర్మాలే సర్వోత్తమములట. అనార్య
ధర్మములు నీచములట—నేనుయీప్రభాతమునకువశిష్ఠు
కడకేగి నా అపరాధక్షమాపణ కోరుకున్న నన్నుశిక్షిం
తురట—(నవ్వి) ఏమిచేయుదురో చూచెదను

ద్వారికుడు- (ప్రవేశించి) జయము దండకప్రభూ! సర్వసై
న్యాధిపతులు అశోకుడు ప్రవేశము కోరుచున్నారు

దండ- వారెందుకువచ్చిరో! పూరకరారు మహాత్ములు!

ద్వా—నాకు తెలియదుప్రభూ!

దండ- ఛీ! పో వారిని ప్రవేశపెట్టు

ద్వా- చిత్తముప్రభూ! (వెళ్లును)

(అశోకుడు ప్రవేశించును)

దండ- ఓహో! ఆర్యరాజేంద్రులు ఇక్ష్వాకుల సైన్యాధిపతులా
మీరెందువచ్చితిరి మహాత్మా! ఏదేని ఉపదేశింతురా?

అశో- లేదు. యిదుగో ఆజ్ఞాపత్రము

దండ- ఆర్యసార్వభౌముని ఆజ్ఞ అనార్యవర్తనుడనగు నేను
చదువుకొనుటవల—తామే చెప్పుడు.

అశో- యీరోజు సంధ్యాసమయములోగా తమ్ము రాష్ట్ర

త్యాగ మొనర్పుమని ఇక్ష్వాకుమహారాజు ఆజ్ఞ

దండ- (వ్యంగ్యంగా) రాజాజ్ఞ—అతడు తండ్రి—నేనుపుత్రు డను. అతను రాజైన నేను స్వధర్మ నిరతుండనగు ప్రజ యుతను.

అశో- (నవ్వి) మంచిది. బయలుదేరుడు

దండ- ఎచటికు?

అశో- వింధ్యోత్తర అనార్యమరుభూములకు

దండ- (పరిహాసముగా) ఎందులకో?

అశో- (కోపముతో) ఆర్యధర్మచ్యుతులగుటచే

దండ- నేనా ధర్మచ్యుతుడను? కన్నకొడుకు స్వేచ్ఛకోరినంతనే దేశభ్రష్టు నొనర్చుట ఆర్యధర్మం! ఏకజాతీయులగు మానవుల ఆర్యులను, అనార్యులని విడదీసి మీమాటకు ఎదురాడినవారిని దస్యులని వధించుట ఆర్యధర్మం! (ఆగి) నే నార్యుడనుగదా అచటి అనార్యులతో కలసి మీపై దండెత్తిన?

అశో- కలదు. ఈ అశోకుని ఖడ్గము

దండ- (నవ్వి) స్వర్థములగుమూఢనమ్మకముల ఆత్మనేల వంచింతువు. స్వేచ్ఛగా యింద్రియ సుఖముల ననుభవించు

అశో- యీ నీ ఉపదేశము లెవరికి?

దండ- ఎవరికా? వశిష్టబోధలచే గ్రుడ్డిదగు నీ హృదయమునకు

అశో- నాకుగాదు బోధింపవలసినది. అరణ్యమున జంతువులకు వృకములకు మీ అనార్యులకు

దండ- మీ ఆర్యులకన్న జంతు, వృకాదులే మేలు

అశో- యిక మాటలాడక పదా లేదేని ఈ ఖడ్గము

దండ- అంత శ్రమ మీకేల. బయలుదేరుదాం (ఆలోచనగా చూచును)

అశో- ధర్మనిరతులగు క్షత్రియు లేదయో ఆలోచించు చున్నారు. ఆలోచన లిచటకాదు. బయలుదేరుము.

దండ- అచట నామిత్రుడు అనార్య నాయకుడగు క్రౌంచుని తోగలసి మీపై తిరుగుబాటు చేసిన

అశో- (నవ్వి) అప్పుడు ఆలోచించవచ్చును___సైనికులారావండి యిరుప్రక్కల రండు

దండ- అశోకా! ఈ సైనికులేల?

అశో- నీ గౌరవార్థము

దండ- (కోపంగా) మీ ఆర్యులకు యితరుల గౌరవించుట గూడా తెలియునా?

అశో- (నవ్వును)

దండ- నేను మీ ఆర్యులపాలిటి కాలసర్పమును గదా. దాని నేరినైన కాటందుననేమోయని కదా యీ సైనికులు

అశో- ప్రత్యక్ష ప్రమాణము

దండ- నీతో నాకేమిపని. యీ అమాయకులగు సైనికులకండ్లు దెరతును. సైనికులారా! కర్మయనుపేర, ధర్మములను పేర ఆత్మవంచనగావించుకొనకుడు. స్వసుఖమే పుణ్యము ఎవ్విధమునైనా యింద్రియసుఖములననుభవించుటయే జన్మ సఫలత, మోక్షము, వేరు భగవంతుడు లేడు,

అశో- దండకా! నీ ప్రలాపముల నాపు. లేదేని___

దండ- దండించెదరా? మానవ జన్మహక్కగు స్వాతంత్ర్య మతేదా? యీ పరిపాలన నిరంకుశము

ఆర్యో- యీ ధర్మదూషణ సహింపరానిది — సైనికులారా పట్టుకరండు

దండ- ఈ దండకుడు పోయెనని సంతసింపకుడు

ఆర్యో- సైనికులారా నడువుడు (వెళ్లెదరు)

— ० —

## రెండవ దృశ్యము

(వింధ్యారణ్యము — క్రౌంచుడు, దండకుడు ప్రవేశింతురు)

దండ- ఎంతసాహసము. మానవ సహజ స్వాతంత్ర్యతనే అరికట్టుటయా! మీ ఆర్యజాతి ఎంతకైనను వెనుదీయదు

క్రౌంచు- ప్రభూ! ఏల యీనిర్వేదన? ఏనాడు మిమ్ముల అనార్య సార్వభౌమా! యని సంబోధించితినో ఆనాడే మీరు సార్వభౌములైతిరి. మధుమంతమను నగర మేర్పరచితిరి. రేపేగదా దండయాత్ర. ప్రపంచమండలి శక్తులన్నియు ఏకమై మిమ్ము సాధింపబూనినను యీ క్రౌంచు డెదుర్కొనగలడు ప్రభూ!

దండ- క్రౌంచా! నీవంతటివాడవే! నీవుండనా కేమికొరత — కాని

ఆర్యమతబోధకులు మన ప్రజలమనస్సు విరిచిరి?

క్రౌంచు-అట్లెన్నటికి జరుగనేరదు ప్రభూ! బోధకులే గాని మన పరి
వారములు పట్టుబడినచో బంధించ సైనికుల కాజ్ఞాపించితిని.

దండ- బుద్ధియున్న నీవే క్రౌంచా! ప్రభుమనము గుర్తెరిగిన మిత్రు
డవు

క్రౌంచు- మీరు మా గురుదేవులు— మా అనార్యులపాలిటి
పెన్నిధి

దండ- ఆ శుక్రుడు అనాదినుండి మాకు గురువై యుండ నేనెట్లు
గురుడనగుదును?

క్రౌంచు- శుక్రాచార్యులు మనల ఆర్యులుగ నొనర్పనే యీ
గురుత్వము స్వీకరించితిరని అరజతో చెప్పగా వింటిని ప్రభూ
కాన వారి ఆచార్యత్వమును త్యజించితిమి

దండ- ఎంత మోసము! అందుకే యీ ఆర్యులు వంచకులని నే
ననునది—సరియేగాని ఆ అరజ ఎవరు క్రౌంచా?

క్రౌంచు-ఆ ముదుసలి శుక్రుని ప్రియపుత్రి. నాడు నగర ప్రవేశన
మహోత్సవమున ఆచార్యుల పిలుచుటకై మనము పోవు
చుండ పూదోటలో కనబడలేదా ప్రభు!

దండ- ఆ...ఆ మల్లెపొద మాటున— ఆదృశ్యము నా కన్నుల
కట్టినట్లున్నది.—అపురూప లావణ్యవతి—ఆనాటిదృశ్య
ము మరువలేను— తొల్కరి మెరపువలె మెరసి పొద
చాటు కేగినది. కాని—ఆ నారచీరెలతో ఆ లావణ్య
మంతయు అడవిగాచిన వెన్నెలచేయుచున్నది—అరజా!
నిన్ను నేను సంస్కరింతును.

క్రౌంచ- ఆదరికేగవలదు ప్రభు! ఆముదునలిశుక్రుడు ముక్కోపి

దండ- (నవ్వి) మిత్రమా, భయపడకు. వాని ముక్కోపితనము నన్నేమిచేయగలదు___ వానికే కాదరు. ఆర్యుల నాశింపగలదుగాని.

క్రౌంచ- అట్లైనా, ప్రభు! వారు శపించగలరు

దండ- ఆ శాపములన్నియు బూటకములు. భయము చేగలిగిన మనోభ్రమ. అదే మనవారిని చంపుచున్నది

భటుడు- (ప్రవేశించి) దండకసార్వభౌమా___నమస్కారము

దండ- విభూమా? ఏలవచ్చితివి?

భటు- మనరాజ్యమున ఆర్యధర్మముల బోధించుచుండ నిరువురు బోధకుల బంధించి తెచ్చితిని

దండ- (నవ్వి) ఓహో బోధకులా? దండకసామ్రాజ్యమున ఆర్యధర్మ బోధకులా? క్రౌంచా? వారు మాతండ్రి___కాదు ఆర్యసార్వభౌముని చారులై యుందురు. నీవుపోయి వారికి వారి మోక్షసామ్రాజ్యమును చూపుము. ఆరక్తమును చవిజూచుచున్న ఈ నా ఖడ్గమును తీసుకొనిపొమ్ము

క్రౌంచ-చిత్తము ప్రభూ! విభూమా పోవుదమురమ్ము (యిరువురు వెళ్లెదరు)

దండ- అరజా... ...నీపేరే నా హృదయము చూరగొనినది నీవంగీకరింపకున్న బలాత్కారముగానైన నిన్ననుభవించితీరెదను___అరజ సహజసౌందర్య___లభించెనేని నా జన్మ సార్థకము

(మధ్యాహ్న కాహళధ్వని)

దండ- మధ్యాహ్నమైనట్లున్నది—మనమూ తొందరపడవలెను ఈ
నాటి సాయంత్రమునకు అరిజ సిదికాగలదు

క్రౌంచు- (ప్రవేశించి) ప్రభూ? మధ్యాహ్న భోజనము సిద్ధమై
నది దయచేయుడు

దండ- ఆర్యబోధకులు వధింపబడిరా?

క్రౌంచు- చిత్తము సార్వభౌమా! యివిగో వారి తలలు—

దండ- (నవ్వి) ఆర్యులు—ధర్మము—మోక్షము—(నవ్వును)

క్రౌంచు- భోజనశాలకు రండి ప్రభూ

దండ- పద (వెళ్ళుదురు)

—: ० :—

## మూడవ దృశ్యము

(పూలదోటలో సరస్సువద్దను అరిజ)
(గేయంపాడుచుండును)

గేయం

చుక్కలరాజా!
రేరాజా!
రావోయి!
జాగేల?
పిలిచెరా
నీతారా!

చల్లని చూపుల
చూడగరారా:
చల్లగ మెల్లగా
రారా రాజా!
పిలిచెరా
నీప్రియతారా!
రా–రా–రేరాజా! రారా!

అర– నీకొర కెందుకుబాధించెదవు మబ్బుతెర నుండి బయటకు రా శేరాజా!

దండ– (ప్రవేశించి) ఎందుకురాను నాతారా!

అర– (భయంగా) ఆ...

దండ– రా నీ శేరాజు కోరకేల కలవరింత నీకై ఎదురుచూచు యీరాజునకు స్వాగతమియ్యి సుందరీ!

అర– (సిగ్గోరపాటుతో భయముగా) స్వాగతమా? నేనిచ్చుటయా? నీవెవరు

దండ– (కోద్దినవ్వుతో) నన్నెరుగవా సుందరీ! నేనే!

అర– నీ వెవ్వరు!

దండ– (నవ్వును)

అర– పరస్త్రీతో నిట్టు ఏకాంతమున పరిహసింపతగునా

దండ– పరస్త్రీవా? కావు... నీవు అవివాహితవు. అదియుగాక యువతి యువకునికి స్వాగతమిడుట ధర్మం.

అర– నాకా ధర్మవిరుద్ధము, నే నార్యయువతిని

దండ– (నవ్వి) అది ప్రత్యక్ష ప్రమాణమే! నిన్ను సంస్కరింప వచ్చితిని

అర– నీ సంస్కరణ నాకు వలదు

దండ– సంస్కరణ మనునది ఒక ప్రవాహము. దానినాప నీ తరమా రా

అర– నే శుక్రునికుమార్తెను

దండ– నే ననార్యసార్వభౌముడను దండకుడను. యువతి నీవు అపరాధివి—విను

అర- నే నిరపరాధిని

నంద- (కపటకోపముతో) నీవు నిరపరాధిని కానేరవు, కోరివచ్చిన యువకుని కన్నెనై గూడ తిరస్కరించుట ఒక అపరాధము. సార్వభౌముని నాజ్ఞ నుల్లంఘించుట రెండవ అపరాధము. యీ అపరాధములకు శిక్ష నా బాహుపంజరమున నిన్ను బంధించుట—రా

అర- ఛీ—దురాత్మా—నన్ను వదలు లేదేని నాతండ్రి నిన్ను భస్మీభూతునిగా చేయగలడు

నంద- నాకు భయమగుచున్నది. యువతీ నన్ను మీ తండ్రి నుండి కాపాడవు

అర- జ్యోతిర్మయ! నన్ను యీనీచుబారినుండి నన్నురక్షించవా నీ సహస్రకిరణముల బరపి యీదురాత్ముని దహించవు జ్యోతిర్మయీ

నంద- భయపడకు సుందరీ! (నవ్వుచు) నా బాహుపంజరమున నున్న నిన్నెవ్వరు రక్షింపగలరు

అర- నన్ను దైవము నాశనమొనర్పగలదు

నంద- (వికటంగా నవ్వుచు) దైవము— ఏడీ నీ జ్యోతిర్మయుడు నాబారినుండి నిన్ను రక్షింపగలడో చూచెదను

అర- నీచా వదులు—అబలను—రక్షింపుడు—అయ్యో

నంద- (నవ్వుచు) నా బాహులతల బంధింపబడిన నీ వెటుబోదువు—ఏల క్రమింతువు హృదయపూర్తిగ నన్ననుభవించుము— పెనుగులాడకు—ఆర్యయువతుల కౌగిళ్లు కోపముతో గూడిననేమధురములు—ఒకముద్దు—ఏదీ.

అర- హా! జ్యోతిర్మయీ — నీసహస్రకిరణములు నన్ను దహించు

దండ- యువతీ! సంగ్రామమున అలసితివి — నిద్రించుము నీ
తండ్రి — ఆ గ్రుడ్డి శుక్రునితో మాత్రము చెప్పకుము
(నవ్వుచు) ఆ గ్రుడ్డికన్ను, ఆ తెల్లగడ్డము చూచిననే
నాకు భయము — మరల నన్ను కోరిన నా మధుమం
తమునకు రమ్ము సుందరీ — వెళ్ళివత్తును

అర- ఛీ — పాపీ

దండ- కోపించక — పోవుచున్నాను (వెళ్ళును)

తెర పడును

—o—

## నాలుగవ దృశ్యము

(మధుమంతనగర రాజభవనము- దండకుడు శయనించి యుండును)

క్రౌంచు- (ప్రవేశించి భయంగా) దండకప్రభూ!

దండ- ఎవరూ?

క్రౌంచు- నేను ప్రభూ

దండ- క్రౌంచా నీవా! ఈ అర్ధరాత్రమున నేల వచ్చితివి

క్రౌంచు- లేవండి ప్రభూ! పారిపోయి ప్రాణాలుదక్కించుకొందాం

దండ– క్రౌంచా! ఏమి తత్తరపాటు! మనము పారిపోవుచుంటిము
 లను? మాతండ్రి ఇక్ష్వాకుడు దండెత్తెనా?

క్రౌంచు– ఆర్యసార్వభౌముడు దండెత్తలేదు ప్రభూ!

దండ– అయిన ఎవరు దండెత్తిరి? చెప్పు క్రౌంచా? యీ ఖడ్గముతో
 వారిని యమపురికంపెదను

క్రౌంచు– ఎవ్వరూ దండెత్తలేదు ప్రభు; కాలసర్పాన్ని కదిలిం
 చారు. అది మనపై పగబట్టి బుసలుకొడుతున్నది ప్రభు

దండ– ఎవరా కాలసర్పము? ఎక్కడ—చెప్పు

క్రౌంచు– ఏమిచెప్పను ప్రభు

దండ– క్రౌంచా నన్ను విసిగించక చెప్పు— నాఖడ్గానికి ఆ కాల
 సర్పాన్ని యిప్పుడే బలిచేస్తాను చెప్పు

క్రౌంచు– ఏమిచెప్పను ప్రభు! యీరాత్రి మొదలు ఏడురాత్రుల
 లో మన మధుమంతము సర్వనాశనమగునని

దండ– అది అసంభవము. యీదండుడు జీవించియుండ మధు
 మంతమున పోటుటీగైన ప్రవేశించజాలదు

క్రౌంచు– పోటుటీగ కాదు ప్రభు! ఆర్య సింహగర్జన

దండ– (కోపముగా) ఎవరా ఆర్యసింహము! చెప్పు క్రౌంచా!

క్రౌంచు– చెబుతా ప్రభు!— మీరు అరజను బలాత్కరించి

దండ– ఆమె జీవితమును స్వర్గసౌఖ్యమున తేల్చితిని

క్రౌంచు– అవును ప్రభు! మీరు వెళ్ళినతరువాత ఆశుక్రుడు వచ్చి
 'మన మధుమంతము పాంశువర్షమున నేలమట్టమగు
 ననియు—(ఆగి) ప్రభు మీరు,

దండ– (నవ్వి) మరణింతువని శపించెనా! యిందుకే యింతభయ

మా! ఇవా చెప్పునది నా సహించదగును క్రౌంచుడేనా?

క్రౌంచు- ఆ శత్రువుని వాక్యము కద్దులేదు ప్రభూ! దేవ గురువు సైతము వెరచును

చండ- (నవ్వి) వెర్రివాడా! ధైర్యముగా నుండుము. యీ శాప మునకే మన మహాసామ్రాజ్యము నాశనమగునా? అసంభ వము.

క్రౌంచు- పట్టుదలవద్దు ప్రభూ! పారిపోదాం పదండి

చండ- మృత్యువునకు వెరచి నన్ను నమ్మిన యీ అనార్య ప్రజను అర్ధరాత్రియందు మృత్యుగహ్వరమున వదలి వెళ్ళు ధీరువుగాదీ దండకుడు. యిది మనజాతికి అగ్ని పరీక్షా సమయము ఈఅగ్నిపరీక్షలో మన అనార్యజాతి నెగ్గినా లోకమందలి ఏశక్తియూ మనల నాశనము నర్పజాలదు— క్రౌంచా!

క్రౌంచా- ప్రభూ!

చండ- నీకు భయముగలదేని పారిపో! నిర్భయముగా పారిపో క్రౌంచా!

క్రౌంచు- ప్రభువును విపత్సముద్రమున వదిలి పారిపోవు స్వామి ద్రోహికాడీ క్రౌంచుడు

(గాలిరొద ప్రారంభము కొద్దిగానుండి ఒక్కసారిగా హెచ్చగును)

క్రౌంచు- మంచివర్షము ప్రారంభించింది ప్రభు

దండ- ధైర్యముగా నుండుము! ధైర్యశాలినే శక్తియు నాశన
మొనర్చలేదు క్రౌంచా

(ఇంకను గాలివాన హెచ్చును)

ప్రజ- (తెరలో గోలగా) ప్రభూ మా యిళ్ళు వాకిళ్ళు
మంటిలో కూరుకపోవుచున్నవి ప్రభూ! మా ప్రాణములు
పోవుచున్నవి ప్రభూ దండక ప్రభూ

దండ- అనార్యులారా! భయపడకుడు. యీ ఆర్యశక్తిని
ధైర్యముగా నెదుర్కొనుడు

(ప్రజలగోల- గాలివాన. తదుపరి ఒక్కసారిగా ప్రజలగోల
తగ్గిపోవును)

క్రౌంచు- ప్రజలందరు చచ్చిరి ప్రభూ! రాజప్రాసాదము, మంటి
లో కూరుకపోవుచున్నది. ప్రభూ! ప్రభూ! నాతల తిరిగి
పోవుచున్నది.

దండ- భయపడకు. యీ ఆర్యశక్తి నెదిర్చిన మనకీర్తి చరిత్ర
లో చిరస్థాయిగా నుండగలదు

క్రౌంచు- ప్ర-భూ- ఒ-క- ది---వ్య-తే-జ-స్సు- న-న్ను న-
హిం-చు-చు-న్న-ది.- ఆ- ప్రభు (పడిపోవును)

దండ- క్రౌంచా! ఇంకెక్కడి క్రౌంచుడు. నా మిత్రుడే మర
ణించెను. (ఆగి) నే పారిపోవుదునా!- ఛీ- ఈ ఆర్యశ
క్తికి వెరచి పారిపోవుదునా?- నే అనార్యుడను. ప్రాణ
మున్నంతవరకు యీ ఆర్యశక్తిని ఎదిరింతును.

(గాలి రొద)

ఒక ధ్వని- నీచా! విను. అనార్యులు వేరుజాతిగాదు- ఆర్యధర్మ విచ్ఛిత్తులే అనార్యులు- ప్రపంచమంతయు ఏకజాతియే నీపేరు ... భారతవర్షమున చిరస్థాయిగా నుండగలదు ఈ ప్రదేశమంతము అరణ్యమై దండకారణ్యమని పిలువ బడును

దండ- (కోపముగా) తస్కరా వచ్చితివా రా దొంగవలె దాగి ఏలమాట్లాడెదవు. నా ఖడ్గము బలిష్ఠమో నీ శాపము బలిష్టమో చూచెదవు రా

ధ్వని- నీచా...(వికటముగా నవ్వు వినపడుచుండును)

దండ- ఆ...ఏమీ... ఎవ్వరూలేరే. ఆర్యధర్మములే యదార్థములా? నే చేసినపనులు పాపములా? కావు- కావు నే మరణించినను మా అనార్యధర్మములు నశించవు. ఈ భారతవర్షమునుపట్టి పీడించి మీఆర్యజాతినే రూపు మాపుదు.- అబ్బా- బాధ- మన్ను- అబ్బా- ఆర్యులు నీచులు-హా (పడిపోవును)

గాలిరొద వినపడుచుండును

తెర పడును

సంపూర్ణం

..o...

# బలి

## ఉద్దేశ్యం

స్త్రీలను వ్యభిచారులుగా మార్చేది సమాజమే — వ్యభిచారికి హృదయం లేదు, ప్రేమలేదు, అంటాము. కాని ధనంకోసం వ్యభిచారి అనేక యాచకుల నాకరించినా ఒకనికే తనహృదయమర్పించి ఆరాధిస్తుంది. అప్పుడతడే తన జీవితసర్వస్వంలాగా తలుస్తుంది.

## పాత్రలు

కాంతారావు- ఒక ఆదర్శ యువకుడు

శేఖర్ – విటుడు. త్రాగుబోతు, వ్యభిచారి

మాధవరావు- కాంతారావు మామ

రంగారావు- పంచాయితీ బోర్డు ప్రసిడెంటు

గోపాలరావు- కరణం

నళిని- వ్యభిచారి

రజని- కాంతారావు భార్య

సూచన- నళిని కాంతారావును 'నళినీకాంత్' అని పిలుస్తుంది.

నళిని ఒక అనాథ స్త్రీ. ఉన్నతభావాలుగలది. కాని సంఘం వ్యభిచారిగా మార్చింది. ఒక పల్లెటూరులో కాలం గడుపుతుంది. [పేరుకు పల్లెటూరేగాని ధనికవర్గానికి, భూస్వాములకు పుట్టినిల్లు ఆగ్రామం] ఈ నళినేకాక అనేకమంది వ్యభిచారమే వృత్తిగా గడిపే స్త్రీలు వున్నారు ఆగ్రామంలో. ఆ గ్రామంలోనే కాంతారావు అనేయువకుడు వున్నాడు. కాంతారావుకు చిన్నతనంలోనే తల్లి గతించింది. స్కూల్ ఫైనల్ చదువుచుండగా తండ్రి మరణించాడు. తండ్రి మరణం కాంతారావును కృంగదీసింది.

తండ్రి మరణానంతరం కాంతారావుకు చాలాదూరం నుండి ఒక సంబంధం నచ్చి స్థిరపడింది. మాధవరావుకూతురు రజనిని పెండ్లాడాడు. రజని ఇదివరకే తన మేనమామ కొడుకు సుదర్శన్‌ను ప్రేమించింది. మాధవరావు ధనతృష్ణతో కాంతారావుకు తన కూతురు నిచ్చాడేకాని, కాంతారావు ఆస్థంతా అతని చదువుకైన అప్పులకు చెల్లుగావడంతో అతనిఆశ నిరాశైనది. దానితో కాంతారావు పై మాధవరావుకు ఈర్ష్యఏర్పడివాళ్ళ పరిమొఖం చూడటమేమానేశాడు. రజనితనహృదయాన్ని ఇదివరకే సుదర్శనానికర్పించినందువల్ల, కాంతారావును ప్రేమించలేక పోయింది. దాంతో కాంతారావు హృదయంలో పెనుతుపాను రేగింది. అదేసమయంలో కాంతారావు S.S.L.C, పరీక్ష పోయింది. అంటుకు మారంపై బాధపడసాగాడు కాంతారావు. రజని అతని మనశ్శాంతికి ప్రయత్నించలేక పోయింది. అప్పుడు నాటకరంగంలో కాంతారావుకు పరిచయమైన స్నేహితురాలు

గా మారిన నళినిని కాంతారావును ఆహ్వానించింది. అతని జీవితానికి రజని కలిగించని ఆనందం, శాంతి నళిని కల్పించింది. పంచాయితీబోర్డు ప్రెసిడెంటు రంగారావు పూర్వాభిమానంతో తనగుమాస్తాగా చేసుకున్నాడు కాంతారావును. కాని కాంతారావుకు శ్రమకు తగిన ఫలితం లభించలేదు. అయినా ఆవిధంగానే కాలం గడుపసాగాడు, కాలక్రమేణా రజనీకాంతుడు కావాలనుకున్న కాంతారావు నళినీకాంతుడయ్యాడు– నళినీ, కాంతారావే తన జీవిత సర్వస్వంగా భావించింది. అట్లా గడిచేరోజుల్లో ఒకనాడు

(నళిని ఇంట్లో ఉదయం పదిగంటలకు)

నళి– నళినీకాంత్! (ఆగి) ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారే?

కాంతా– (పరధ్యాన్నంగా) ఊఁ...

నళి– పలుకదలచుకోలేదా

కాంతా– నళిని హృదయంలోని మధురమధువును గ్రోలి నళినీకాంతుడయ్యాను, నళిని పిలిచిన నళినీకాంతుడు పలుకడా?

నళి– (చిరునవ్వుతో) ఆ...కవికుమారులు కవితాగానం చేస్తున్నారే?

కాంతా– కవితాగానంకాదు నళిని నిజంగా నినువీడి నిముసమైనా మనగలనా?

నళి– పరీక్షలువోయి బాధపడుచున్నపుడు తిరస్కారించావా!

ఆరాధించా? నా జీవితాన్ని పవిత్రంచేసుకున్నా

కాంతా— ఆ ఆరాధించావ్! జీవిత సౌభాగ్యాన్ని నాశనంచేసు కున్నావు! నాలాగే దరిద్రంతో నరకబాధపడుతున్నావు

నళి— మీతో నరకం నాకు స్వర్గమే!

కాంతా— నీ హృదయ మింత నిష్కల్మష ప్రేమ మయమే! నళినీ! ఇలా సంఘంలో నీకు గౌరవం లభించదా!

నళి— (విచారంగా) అనాధను యీ సంఘంలో ధర్మంగా జీవించాలంటే మార్గంలేదు—— అనాధ నైతికపతనం చెందిచేసే జీవనం——(ఆవేశంగా) నేను నా శీలాన్ని కాపాడుకున్నంత కాలం యీలోకంలో నాకు తిన తిండి దొరకక మలమల మాడాను. నాశీలాన్ని బజారులోపెట్టాను. నాచుట్టూడబ్బు మూల్గింది, కానినాఅంతరాత్మ నీవుచేసేదిపాపంఅని ప్రబోధించింది కాని కడుపుకోసం నా అంతరాత్మను ద్రోహం చేయక తప్పలేదు. నన్ను వ్యభిచారిగా మార్చిన యీసంఘం నన్నుచూచి వ్యంగ్యంగానవ్వసాగింది. నాహృదయంలోని బాధ ప్రతీకారంచేయ ప్రేరేపించింది. యీసంఘంపై నా పగ తీర్చుకోదలిచా. యువకుల నందరినీ నా రూపంఅనే ఎరతో ఆకర్షించా—— నే వారి డబ్బుదోచా—— బికారులుగా చేశా——సంఘం నన్ను రాక్షసన్నది. హృదయం లేదన్నది. ప్రేమ లేదన్నది. నీదృష్టికి నేను అంతేనా కాంత్!

కాంతా— నాదృష్టికి ఈసంఘంలోని నీబోటి ప్రతి నిర్భాగ్యజీవి ఒక పవిత్రజీవి. నీమనస్ఫూర్తిగా నీవు వ్యభిచరించలేదు బ్రతుకు తెరువుకోసంచేశావు. నన్ను మనసారా ప్రేమిం

నావు. నన్నేడబ్బును కాలదన్నుకున్నావు. నీకై డబ్బు
నెదజల్లే శేఖర్‌ను వదిలావు. నన్నాహ్వానించి నాక
లనే ఆకలితో అల్లాడుతున్నావు

నళి- ఆకలితో అల్లాడితేనేం. ఎవరిప్రాణి కష్టాన్నీ గమనించ
లేని డబ్బుగల కుర్ర- సేవనువదిలి స్వేచ్ఛగా బ్రతుకుతున్నా
మీరు నాస్వాములైనప్పటినుంచీ నాజీవితంలో పొందని
సంతోషాన్ని సౌఖ్యాన్ని పొందుతున్నాను

కాంతా- ఏమిసౌఖ్యాన్ని పొందుతున్నావ్! మాసుచీరలతో
కడుపునిండని తిండితో,— ఆ అర్ధతిండైనా సరిగ్గైక
దయితేనా

నళి- కాకపోవచ్చు—మానవుడు జీవించడానికి తిండే ప్రధాన
మనేనా మీ వుద్దేశ్యం

కాంతా- కాదు సంతోషం— స్వేచ్ఛ. అయినా— కడుపు
కాలుతుంటే సంతోష మేవిధంగా లభిస్తుంది. (ఆవేశం
గా) నళినీ ఈ నిర్భాగ్యుడైన కాంతారావును వదలి
పెట్టు, ఆ శేఖర్‌ను ఆహ్వానించు. నీజీవితం నిశ్చింతగా
గడుస్తుంది. నన్ను త్యజించు—నళినీ —నామాటవినుః

నళి- (దుఃఖంగా) అబ్బా! ఇక ఎప్పుడూ యిట్లా అనకండి

కాంతా- నళినీ ఏడుస్తున్నావా? నా కొరకై నీవు బాధపడు
తున్నావని ఆవేశంలో ఏదో అన్నా. క్షమించవూ

నళి- నన్ను క్షమించమంటారా! సుడిగుండంలోపడ్డ నాజీవితనౌక
కు మీరు చుక్కాని పట్టి ప్రశాంత ప్రవాహంలోనికి లా
గారు. మీరుణం నేతీర్చుకోగలనా. నా వెనుకటి పాపాలు

మీరే క్షమించాలి

కాంతా– అబ్బా—— మనస్సుకు ఏదో బాధగావుంది నళినీ!

నళి– ఒక్క పాటపాడనా!

కాంతా– నా గేయాలేకదూ నీవుపాడేది— అర్థంలేని పిచ్చి గేయాలు

నళి– ఆమాట అనకండి. మీ గేయాల్లో ఎంతో నిగూఢభావాలు లున్నాయ్

కాంతా– కాని వాటికి ప్రజాదరణ ఏదీ? అర్థంజేసుకునేదెవరు?

నళి– పేపర్లకు పంపండి, ప్రజానీకం మధ్యకుపోయి ప్రజాదరణ పొందుతాయి

కాంతా– (విసుగుగా) పేపర్లు——పేపర్లు నాబోటి క్రొత్తకవులను ఆదరించవు. దానికి కారణం పేరుపడినకవి గేయంపడితే నే అవి అమ్ముడుపోతాయి. అందుకు వాళ్లు ఆకవుల కెంత డబ్బిచ్చైనా వారి గేయాలే వేస్తారు

నళి– ఆ పేరుపొందిన కవులుకూడా మొదట మీలాంటివాళ్లేగా వారెలా పైకొచ్చారు

కాంతా– రికమండేషన్——ఈకాలంలో దాన్నిమించిన ఆయుధ మేలేదు

నళి– మరి మీరూ రికమండేషన్‌కోసం ప్రయత్నించండి

కాంతా– నా కెవరున్నారు రికమండుచేయను

నళి– అంతమాత్రానికే నిరుత్సాహపడకండి. మీ మామగారు పెద్దకవేగా!

కాంతా– కావచ్చు—— ఆయన ఎక్కువ సనాతనుడు. ఆయన కవిత్వం ఇనుప గుగ్గిళ్ళు——ఆయనను పలకరించేవారే

లేక ఆయనేడుస్తున్నాడు.

నళి- కొన్నాళ్ళకు యీ కాలం పరివర్తనచెందుతుంది. అప్పుడు మీబోటివాళ్ళకే అభ్యుదయం

కాంతా- ఆ అభ్యుదయ యుగమనేది మనం బ్రతికుండగారాదు తరువాత ఏమో

నళి- అట్లా అనకండి. భవిష్యత్తు ఎవరుచెప్పగలరు. లేని పోని ఆలోచనలతో మనస్సు చీకాకుపరచుకోకండి. గేయం పాడతాను వినండి

కాంతా- పాడు నళినీ నీకమ్మనికంఠాన్ని వింటూ నీలో లీనమై పోతాను

నళిని- గే య ం

ఓ ప్రియా... ... ...
ఓ ప్రియా... ... ...
మెల్లగా
మ్రోగింపరా
హృదయ వీణా! ॥ఓప్రియా॥

నాహృదయము
పరవశమై
సోలగా ॥మ్రోగిం॥

నాజీవితమే
మధురస్వప్నమై

కేళియాడగా ॥మ్రోగి॥

చల్ల చల్లగా
నావెద నీవెద
ఏకముజేసి ॥మ్రోగి॥

నీకను చూపుల
జాడలలోన
నే లీనముగాగా ॥మ్రోగి॥

నీకౌగిలిలో
ఏకము జేసుక
నే సోలిపోవగా ॥మ్రోగి॥

కాంతా- నీవు నీ కమ్మనిగొంతుతో పాడితే నా హృదయం స్వర్గసీమల్లో విహరించింది నళినీ! పరవశమైపోయ్యాను

నళి— మన జీవితం ఎల్లప్పుడూ యిలా ఆనందంగా గడుస్తుందా

(బయటనుండి) కాంతారావుగారు

కాంతా- ఎవరు?

(బయట)సుబ్బిశెట్టిగారు పిలుచుకరమ్మన్నారండి

కాంతా- కొట్టుబాకి అడగటానికేమో, నాఘర్సులోని 20 రూపాయలూ యిలాయియ్యి. యీనెలజీతంలో నాగాలుపోను ప్రెసిడెంటుగారిచ్చినవి యిరవైమాత్రమే—అవి యీయనకు సమర్పించివస్తా

నళి- పంచాయతిబోర్డు లెక్కలేగాక కరణం,మునసబుల లెక్క-

లుగూడా చూస్తారుగదా! ఆ యిచ్చే 30లో కత్తిరింపు దేనికి?

కాంతా- అయ్యో! ఎంతమాట. ఇలా మనబోటివాండ్ల జీతాలు కత్తిరించకపోతే వారి కుటుంబం భవిష్యత్తు గావాలి

నళి- 100 ఎకరాల పొలముందిగా

కాంతా- కుటుంబఖర్చుకు యీ కత్తిరింపుల్లో మిగిలింది___ పొలాల్లోవచ్చేది వడ్డీవ్యాపారానికి చాలొద్దూ

నళి- యిదుగోనండి ఖర్చు

కాంతా- అబ్బా___వెళ్లొస్తా___తలుపువేసుకో నళిని (వెళ్ళును)

నళి- ఎవరు! [ఈలపాటధ్వని]

శేఖర్- (తాగినస్వరంతో) నేనే నళినీ! అడగకుండా వచ్చాను క్షమించు

నళి- ఓ! శేఖర్ గారా! (అసహ్యంగా) ప్రూరకరారు మహాత్ములు ఎందు కిలా దయచేశారు?

శేఖ- అలా కుమారిదగ్గరకెళ్ళి వస్తూ నిన్నుచూచి మాట్లాడిపోదామని వచ్చా

నళి- (కోపంగా) నాతో మీకేంమాటలు___ నాకు పనుంది. దయచెయ్యండి

శేఖ- (నవ్వుచూ) కుమారియింటికి వెళ్ళానని కోపమా?

నళి- (అసహ్యంగా) నాకు మీమీద కోపమేమిటి. కుమారియింటికేకాదు ఎందరియిండ్లకైనా వెళ్ళండి. కాని నా యింటికిమాత్రం రాకండి

శేఖ- వస్తేనేం

నళి- ఇక్కడ మీ కెవరితో పనుంది

శేఖ- నీతోనే

నళి- నాతో మీకేంపనిలేదు. అధిక ప్రసంగం చెయ్యకుండా దయచెయ్యండి

శేఖ- వెళ్ళకపోతే

నళి- మంచిమనిషికొక మాట. మంచిగొడ్డుకొక దెబ్బ అన్నారు.

శేఖ- నళిని—నువ్వు మాట్లాడేది శేఖరుతో— 100 రూపాయలనోటుకు పతివ్రతలమనేవాళ్ళే దాసోహమన్నారు. నువ్వేం లెక్క

నళి- నీ డబ్బుతో అమాయకస్త్రీల శరీరాలను స్వాధీనంచేసుకోగలవు. కాని హృదయాలను ఎంతడబ్బయినా కొనలేవు శేఖర్

శేఖ- నళినీ ఏ స్త్రీకూడా నన్నిలా అనలేదు, నీమీద ప్రేమతో నీవన్నా సహిస్తున్నా—యీనోటు తీసుకో

నళి- ఛీనాహృదయం కాంతారావుకర్పించా—నళినీకాంతున్ని చేసుకున్నా—నీడబ్బు నాహృదయాన్నాకర్షించ జాలదు. వెళ్ళు

శేఖ- (నవ్వుచు) హృదయం—వెలయాలికి హృదయమా!

నళి- ఒక దిక్కూమాలినస్త్రీని వెలయాలిగామార్చేది మీరే ఆస్త్రీవద్దవున్న యౌవ్వనాన్ని, సౌందర్యాన్ని నాశనం చేసి చెరకుపిప్పిల విసర్జిస్తారు. మీ జీవాలకుపడి ఆస్త్రీ జీవితాంతంవరకు అల్లాడుతుంది. మీరంతా నిచులు.

(కోపంతో—ఛా! వెళ్ళు)

శేఖ- నీవు యీ డబ్బుకోసమే పతితవయ్యావు. అదక్కా నీవస్త్ర ను వదిలివస్తే కాలకన్నకోకు— నా ధన సర్వస్వాన్ని నీకర్పిస్తా

నళి- శేఖర్ నాకోసం నీ ధనమంతా ఖర్చుచేస్తానన్నావే— ఆకటిమాడు ప్రాణుల కింత తిండిలేక ఎంతమంది అల్లాడుతున్నారో ఆ పేదజనానికియ్యి— నీకు పుణ్యంవస్తుంది

శేఖ- పుణ్యం—ఆ పాపరిపోతు సేవలకోసంగాదు మానాన్న సంపాదించింది. నా కోసం—నళినీ నేను వచ్చింది యీ ధర్మోపదేశాలకోసంగాదు

నళి- అవును. ధర్మంతో మీకేం పని- మీరు మానవులైతేగా మీకు, ధర్మం, దయ, సత్యాలంటే ఏమిటో తెలియడానికి

శేఖ- నీమాటలతో నా వొళ్ళు మండిపోతున్నది జాగ్రత్త

నళి- నీవు నన్నేంచేయలేవు, యింకెప్పుడూ నాయింటికిరాకు

శేఖ- యిదుగో యీ 500 తీసుకో

నళి- ఛీ! బుద్ధిలేదు. ఆ కుక్కకైనా ఒకసారి కొడితే మళ్ళీ రాదు— ఛీ! వెళ్ళు—వెళ్ళవోయ్ కుక్కా—అని

శేఖ- (కొట్టును) లంజా

నళి. శేఖర్! కాంతారావులేని సమయంలోవచ్చి నన్నే కొడతావా. కాంతారావు తే నీప్రాణాలు బలిగొనుండేవాడు. నీచుడా! పో- తాగుబోతు కుక్కా

శేఖ- (కోపంగా) పోతున్నానళిని. కాని ఎప్పుడైనా యీ శేఖరే

నీను గతి. (వెళ్ళును)

నళి- నీచుడు—కొట్టాడు (దుఃఖంగా) యీ ప్రపంచంలో అనాథలను స్థానమేలేదా (పెద్దగా) నళినీకాంత్

(కాంతారావు ప్రవేశం)

కాంతా- నళినీ!

నళి- (దుఃఖంతో) నళినీకాంత్

కాంతా- ఎందుకలా కన్నీళ్లుపెడుతావ్! చెప్పవ్వా — నళినీ చెప్పవ్వా?

నళి- శేఖర్ వచ్చి మీభార్యనుండి మిమ్మె వేరుచేసిన ద్రోహి ననీ తూలనాడి పొయ్యాడు. నిజంగాకూడా మీభార్యకు మిమ్ములదూరంచేసింది నేనేగా

కాంతా- భార్య—తాళిగట్టినమాత్రాన్నే భార్యగాదు. పురుషుని కష్టసుఖాల్లో భాగంపంచుక పురుషుని హృదయానికి అనుగుణంగా మెలిగేస్త్రీయే భార్య! నా ధర్మపత్నివి నీవే!

నళి- (ఆశ్చర్యంగా) నేనా నీ ధర్మపత్నిని. వ్యభిచారిని

కాంతా- నీవు వ్యభిచారివే — నీవు భహిరంగంగా వ్యభిచరించావ్. నాభార్య నన్ను తెరచాటుచేసుక వ్యభిచరించింది.

నళి- మీకు మతి పోతున్నది

కాంతా- అవును నిజమే మతిపోతున్నది. యీ పత్రంచూడు. యీ గ్రామమంతా మహాఇల్లాలనిపొగిడే నాధర్మపత్ని రజనికి ఆమె పాత్రప్రియుడు వ్రాసిన ప్రణయలేఖ

నళి- ఆ... (ఆగి) యీ ఉత్తరం నిజమంటారా!

కాంతా- (కోపంగా) కాదు—నేను వ్రాశాను

నళిని- అబ్బా నేనామాటన్నానా? ఎవరో కాడిపెధవ యీ లెటరు వ్రాసుంటాడు

కాంతా- కాకీపెధవ రాసినదికాదు — యిదంతా చిన్ననాటి నుండీ ఆడుతున్న నాటకం- ఇదుగో ఈ మచ్చునొక్క- చాలిస్తూ 'నీవు కాంతం దగ్గరనుండీ మనయింటికెప్పుడు వస్తావు- నన్ను నీవు మరచినా నిన్ను నేమరువజాలను' దానికి జవాబుగా నా భార్యగారు వ్రాసిన వుత్తరం. ఈవుత్తరం ఒక పిల్లవానికిచ్చి పోష్టుకు పంపింది. వాడు యీ నాటకంసంగతి తెలియక నాకిచ్చాడు. యీలెట రు చదువు

నళి- (ఆశ్చర్యంగా) ఆ

కాంతా- లెటరుచూచి ఆశ్చర్యపడతావేం నళినీ? యీలాంటి పతివ్రతలు దేశంలో కోట్లకొలదివున్నారు. ఒట్టిమత్తు తో భర్తకు మందుపెట్టి మతిపరచి ప్రియులతో భర్త ఎదుటనే కులికే కులటలు పతివ్రతలు ఈ సంఘందృష్టి లో—వారపుణ్యాంగనలు— కడుపుకోసం వ్యభిచరించినా ఒకనిపై ప్రేమితో మెలిగే నీబోటిస్త్రీలు పంచాంగసలు ఈసంఘంలో —నేను ఈపుణ్యాంగన తెరచాటు జీవితాన్ని నడిబజారులో పెడతాను.

నళి- నళినీకాంత్ —నీభార్య ఒకస్త్రీ—స్త్రీ మానధని—నీవు ఈఉత్తరాలు బయలుపరచి ఆమె జీవితాన్ని నాశనం

చేస్తావా? యిదేనా విజ్ఞానం—నీ ఆదర్శం

కాంతా- అయితే నా జీవితాన్ని బలిచేయమంటావ్

నళి- మీమనస్సుకీ ఆమెమనస్సు ఏకంకాకపోవచ్చు. కాని మీభార్య వ్యభిచారి కాదనే నావుద్దేశ్యం. ఫ్రాస్ట్రేషను తో అల్లాడుతూండవచ్చు—అదిగాక ఆమెను మీరు పెండ్లిచేసుకున్నది ఈవిధంగా ఆమెను నాశనం చేయడానికి కాదు

కాంతా- నాభార్యే కాదు

నళి- మీరుకాదన్నా చట్టము మీభార్యేనంటుంది

కాంతా- కావచ్చు- చట్టం నన్నేంచెయ్యగలదు. సంపాదించే దానిలో సగము రజనికిమ్మిస్తుంది. అంతేగా!

నళి- ఎంతచులకనగా తేల్చేస్తున్నావ్!- నిన్నుజూచినప్పుడల్లా సంఘం వెక్కిరిస్తుంది. అవమానిస్తుంది

కాంతా- అబ్బా- మాట్లాడకు నళిని బాధగావుంది. అబ్బా-

(బయటనుండి)- అబ్బాయ్ కాంతారావ్ (అంటూ మాధవరావు ప్రవేశం)

కాంతా- ఎవరు?

మాధ- నేనేనోయ్! ఏం కళ్లునెత్తికెక్కాయా! ఎవరంటున్నావ్

కాంతా- మామగారా! దయచేయండి, కూర్చోండి

నళి- మాధవరావు తాతగారూ నమస్కారం. మీలాగే మీ అల్లుడూ పెద్ద కవయ్యాడు

మాధ- (వ్యంగ్యంగా) ఆ...అయ్యాడు... పెద్ద కవయ్యాడని తెలిసే వచ్చా. యిదుగో యీనది రాసి చందాలెత్తి

ప్రింటు చేయించిన మా 'సంఘం' అనే పుస్తకమే చెబు
తుంది. మనధర్మాలను, మన జీవితాన్ని అంతా శాస్త్ర
ప్రమాణం, ధర్మానుసారికే. ఓకేండ్ కాంతం ఈపదునంతా
ఏకురుప్రస్థక చేర్చావ్!

కాంతా — (వినుగా బాధగా) అబ్బా తలకాయ నొప్పిగా వుంది కాసేపు కూర్చోండి, తరువాత మాట్లాడుదాం.

మాధవ — ఒప్పు బాగులేకుంటే యిక్కడ దేనికిరా! యీ రూమ్ తీసుకున్నావా? ఈ అమ్మాయి ఎవరురా?

కాంతా — కాసేపు ఆగండి తల బాధగా వుంది.

మాధవ — ఓహో నాతో మాట్లాడాలంటే తల నొప్పిగా వుందేం.

కాంతా — ఈ రూమ్ నాదిగాదు యీనళినిది.

మాధవ — ఈ రూమ్ నీదిగాదూ! కాకపోతే పొద్దస్తమానం యిక్కడే వుంటావట దేనికిరా?

కాంతా — యీనళినే నా సర్వస్వం.

మాధవ — ఆ- నేను చూడగనే అనుకున్నా- అమ్మాయీ నీ వెవరు? ఏ కులం?

నళిని — నేను హిందూస్త్రీని పతితను.

మాధవ — (వ్యంగ్యంగా) ఓహో- పతితట- (కోపంగా) వ్యభిచారిణివి ఏడ్చుకపోయ్యావ్!- అయితే కాంతం నీకు పెండ్లాం యిల్లువాకిలి పనిలేదురా? దానితోనే లోకమట్రా- నాకూతురు ఏడిపిస్తున్నావని తెలిసే వచ్చాను, వూళ్లో అడుగుపెట్టగానే అంతా తెలిసింది.

ఇంటికి వెళ్ళా నీకోసం ఎదురుచూచి రాకపోతే ఆఖరుకు యిక్కడకు వచ్చా. నా కూతురు మహా ఇల్లాలు, దాని నేడిపిస్తున్నావ్! ఆ వ్యసనం నీకు తప్పక తగులు తుంది.

కాంతా - ఆ– నీ కూతురేం మహా ఇల్లాలుగాదు! సందుగొం దుల వ్యభిచారి

నళిని – ఆ – నళినీ కాంత్ !– ఏమిటీ మాటలు ?

కాంతా – కళ్ళకుకంఫ్లు జాస్తే దాగదు నళినీ!– బయలుపడితీరు తుంది. యీనకు తనకూతురుసంగతి తెలుసు– కాని కప్పిపుచ్చాలని చూస్తున్నాడు. యిదిగోనండి మామ గారు పతివ్రతా శిరోమణియైన మీ కూతురుకు ఆమె ప్రియుడు వ్రాసిన ఉత్తరం. దానికి మీరజని గారి జవాబు.

మాధవ – ఏదోయ్ ! ఆ ఉత్తరం:– ఎవడో నా విరోధి నాపై పగతో వ్రాసి యుంటాడు.

కాంతా - ఈలెటరువ్రాసిన (నీమేనల్లుడు)సుదర్శన్ నీకువిరోధేం. నీ ఇంట్లో పడుండి చాకిరిచేసే సుదర్శన్‌తో నీకు పగెప్పటినుండి ?

మాధవ – "కాపరం గుట్టు వ్యాధి రట్టు" అన్నారోయ్. ఇంట్లో పగలు బయటికివస్తాయటోయ్ ! అదీకాక ఒక వేళ ఇది నిజమే అనుకుందాం అంత మాత్రానికే భార్యను వదులుకుంటావురా !

కాంతా - అబ్బే వదులుకూడదు - లోపల రహస్యంగా

స్త్రీయు ...వాక్చి ; యీ నళినిలాంటి వాళ్ళను పరిహ
సించాలి. అదే పెద్దమనిషితనం, పురుషలక్షణం.

మాధవ – కాకపోయినా యిదివరకు గానికా బుద్ధి రేదు.
అగ్నిహోత్రం నీవే నేర్పుతుంటావ్ !

కాంతా – మామగారు ఇక మర్యాదగా యిక్కడనుండి దయ
చేయండి,

మాధవ – పోకపాతివ్రత్యంచేస్తావురా ?– యీ కులట ఏ మందో
మాకో పెట్టి నీ మతి విరిచింది. యీవిధంగా పిచ్చి
వాడివై పోయ్యావ్ !

కాంతా – రజని నేనే నమ్మిన్నంటే ఆపని తప్పక చేసేది, ఇక
తాము నోరుమూసుక దయచెయ్యండి. నళిని తలుపు
వెయ్యి ! వీరు సంఘంలో పెద్దమనుష్యులు.

మాధవ – మే మెలా పెద్దలమౌతాం లేవోయ్ ! నీ వే
పెద్దమనిషివి. భార్య మతితప్పలేని మగధీరుడవు.

నళిని – కాంతారావునునే పంపిస్తాను. మీరు వెళ్ళండి.

మాధవ – పంపించమ్మా. ఇంట్లో ఏమన్నా వుంటే తీసుక
రమ్మని.

కాంతా – ఏముంది మనింట్లో నళినే తన ధనాన్నంతా నాకు
దోచిపెట్టింది_ యిక తాము దయచెయ్యండి.

మాధవ – పోతున్నా లేవోయ్ ! తల్లిదండ్రీ లేనివాడవుగదా
అని పిల్లనిస్తే !

కాంతా – పాపం నామీద దయతో యిచ్చారన్నమాట –
నా చదువుచూచి యిచ్చావ్ అంతేగాదు నేనొక్కడినే

కాబట్టి ఏ అడ్డూ ఆపూ లేకుండా నీ ఇష్టం వచ్చినట్టు
స్వేచ్ఛావిహారం చేస్తుందని గాదన్నమాట.

మాధవ - ఈ బజారు దానితో కలుసుకుంటూ నా పరువు
గంగలో కలుపుతావా! ప్రెసిడెంటు రంగారావుగారిని
కరణం గోపాలరావుగారిని పిలుచుక వచ్చి నీ అంతూ
( నీ ఉద్యోగం అంతూ ) నీ నళిని అంతూ తేల్చకపోతే
నే మాధవరావునే-

కాంతా - మీరంతా కలిసి ఏమిచేసినా భరిస్తాను. ఈప్రపంచం
కాదు చాలా ప్రపంచముంది జీవించడానికి.

మాధవ - ఏలా జీవిస్తావో చూస్తాగా- మాధవరావంటే
దూడలపుల్లా యనుకున్నావుగామాలు. చూస్తావుగా-
( వెళ్లును )

నళిని - జడివాన కురిసి వెలిసినట్టుంది.

కాంతా - వెళ్ళాడు పీడ వదిలింది.- అబ్బా- ఊ-

నళిని - నా వళ్ళు మండిపోతున్నది న ళి నీ కా ం త్ ! జ్వరం
వచ్చినట్టుంది.

కాంతా - డాక్టరు. జాన్‌నద్ద కెళ్ళి ఏదైనా మందుతీసుకవస్తాను
నళినీ.

నళిని- జ్వరం బాగావచ్చింది- జాగ్రత్తగారండి;

కాంతా - నరే తలుపు వేసుకో నళిని! జాగ్రత్త ( వెళ్ళును )

( బయట రజని- "నళినిగారూ" అంటూ రజనిప్రవేశం. )

నళిని - ఎవరమ్మా! నిలబడతారేం! రండి కూర్చోండి.

రజని - నేనొక అనాథను.

నళిని – మిగా పేరేంటమ్మా ?

రజని – ( సందేహంగా ) నా పేరా ?

నళిని – భయపడతారు దేనికి ? చెప్పండమ్మా.

రజని – రజని.

నళిని – ( ఆశ్చర్యంగా ) ఆ– రజనీ ! ( ఆగి ) పుణ్యాంగనలకు పుణ్యాంగనలతో పనేమమ్మా !

రజని — అలా అనకు నేను ఒక కులటను.

నళిని – కాదు నీవు కాంతారావు ధర్మపత్నివి.

రజని – నీచురాలను నళినీ !. కాంతారావుకు ద్రోహంచేశాను అందుకే ఆయనకు దూరమయ్యాను,

నళిని – ఆయన నీ కెప్పుడూ నన్ని హితమే

రజని – ఆయన హృదయాన్ని అర్థంచేసుకోలేక బాధపెట్టాను. నీవు నా కాంతుణ్ణారాధించావు.— కాంతారావు నీవాడే కాని – నా చిన్నకోర్కె ఒకటి నెరవేర్చు అక్కా.

నళిని – చెప్పమ్మ సాధ్యమైతే చేస్తా ?

రజని – అసలు నీకు సాధ్యమే, నీచేతుల్లోదే.

నళిని – చెప్పు రజని– చెప్పు నా సాధ్యమైతే తప్పక చేస్తాను.

రజని – వేరుగా భావించకు నళినీ ! నే నడిగేది నీ హృదయానికి బాధ గలిగించవచ్చు. కానీ కోరక తప్పదు. నాకోసం నీ కాంతారావును త్యాగం చెయ్యి.

నళిని – నళినీకాంతుణ్ణిడి నళిని బ్రతుకలేదు. నీవెళ్ళు

రజని– అలా అనకు నళినీ! నీ సర్వ సౌఖ్యాలను, ధనాన్ని, కాంతారావుకోసం త్యాగంచేశావు. నీకై డబ్బువెద

జల్లే శేఖర్ను వదులుకున్నావు. యిదంతా నాకు
తెలుసు, నేను పాతిశ్రీని నాభర్తను వివాహంచేసుకున్న
పాపిని. పతిభిక్ష నిన్ను యాచిస్తున్నాను. కాంతారావు
హృదయంలో నాకు స్థానంకల్పించు నళినీ!

నళిని– హృదయంలో స్థానం ఒకరు కల్పిస్తే ఏర్పడదు— నీవు
ప్రయత్నించు

రజని– (దుఃఖంతో) నీవు కాంతారావు హృదయంలో నాకు
స్థానం కల్పించగలవు—నళినీ—కాదనకు. యీ నీ చే
తులుగావు కాళ్ళు—దీనురాలను. నాకోర్కె సరవేర్చు
నళినీ—నీవు కాదంటే నాజీవితం సూన్యం. నళినీ—

నళిని– నళిని జీవించియుండగా కాంత్ నీవాడుకావటం అసం
భవం— నేను నీకోసం త్యాగంచేస్తాను

రజని– వద్దు నళినీ! ఆపనిచేయకు

నళిని– యీ నవ్రజపుటుంగరం నళినీకాంతుడినుండి నళినిని దూరం
చేస్తుంది. కాని వారి హృదయంనుండికాదు —
ఇక నీవువెళ్ళు. ఇకనైనా నీభర్తే నీ సర్వస్వగా ఆరా
ధించు — (దుఃఖస్వరంతో) ఇక నాఎదుట నిలువకు
వెళ్ళు

రజని– నీఋణం తీర్చుకోలేను నళిని—త్యాగమూర్తివి

నళిని– రజనీ ఇక నీవువెళ్ళు...పో...

రజని– పోయివస్తానమ్మా (వెళ్ళును)

నళిని– (దుఃఖంతో) నళినీకాంత్—ఒక స్త్రీకోసం నేను త్యా
గంచేస్తా—నళినీకాంతుడు వచ్చేలోగా నామాట నెర

వేస్తావా? నాకు నా కాంతుని అంతిమదర్శనం యీ ఫోటోమాత్రమే. నళినీకాంత్ నీఋణం తీర్చుకోలేకుండా పోయానని చెప్పుకుంటున్నందుకు క్షమించు (ఉంగరం పగలగొట్టి నూరి త్రాగును)

నళిని- (బాధగా) యీ వజ్రపుటుంగరం— నీవు మనసార ప్రేమించి నాకిచ్చిన అమూల్యమైన కానుక. ఇదే మనిద్దరి వియోగానికి తోడ్పడ్డది. అబ్బా— నళినీకాంత్ — ఊఁ— అబ్బా... ... (పడిపోవును) క్షమించు—వచ్చేజన్మలో నీకు భార్యనౌతా— అబ్బా...ఊఁ...

(మాధవరావు, రంగారావు, గోపాలరావు, ప్రవేశం)

మాధ- అబ్బాయ్! కాంతారావ్! తలుపుతియ్యి. కాంతారావ్

రంగా- కాంతారావు పంతులుగారూ

గోపా. ఆ అమ్మాయి ఒక్కతే నిద్రపోతున్నట్లుందండి. తలుపు కొట్టండి. మాధవరావుగారూ

మాధ- నళినీ— నళినీ (తలుపుకొట్టును)

రజని- నాన్నా (అని ప్రవేశించును)

మాధ- ఇక్కడికొచ్చావ్ దేనికమ్మా!

రజని_ (నవ్వుతూ) పెద్దనాటకంఆడా నాన్నా' మావారిని ఈ కులట నదలిపోయ్యేట్లు చేశానాన్నా!

రంగా- ఏంచేశారండీ! రజనీగారూ

రజని- (నవ్వుతూ) నళిని యీలోకాన్ని విడిపోయ్యేట్లుచేశానండీ

ప్రసిడెంటుగారూ!

మాధ- ఆపాడుముండ పీడవదిలింది——అబ్బా——మనపేట [illegible]టికి విముక్తైంది

గంగా- మీపీడే కాదండీ! ఆషావుకారు పీడ వదిలింది. పాపం అతని కొడుకు శేఖర్‌కు ఏం మత్తుమందు చల్లిందో కొంపంతా దోచిపెడుతూ నళిని, నళినీ అని కలవరించేవాడు.

మాధవ - మా అమ్మాయి మంచి తెలివిగలదిలెండి.

గోపా - మీరే చంపారా ఏమండీ రజనిగారూ.

రజని - లేదండీ అదే ఆత్మహత్య చేసుకుంటానంది.

గోపా - పెద్దచిక్కే. నళిని తన మరణస్టేటుమెంటు ఏలా వ్రాసిందో ఆ స్టేట్‌మెంటులోనే వుంది కాంతారావు ప్రాణం.

మాధవ - (విచారంగా) అట్లాగండీ! ఛీ పాడుముండ చచ్చి కూడా కాంతారావును దక్కనివ్వదూ? - అయ్యో!- ఇక మా కాంతంగతేమిటండీ!

గంగా - భయపడకండి. మన కరణం గోపాలరావు తలుచుకొంటే యిదెంతమాత్రం- మా పెద్దబ్బాయి భార్యతో పోట్లాడి కొట్టాడు. దాంతో అది చచ్చింది. ఆరోజు యిక్కడ తహసిల్‌దారుకూడా వున్నాడు, కాని ఏ కేసు లేకుండా చేసేడు. ఘటనాఘటన సమర్థుడులెండి.

మాధవ - గోపాలరావుగారూ మీరు నాపై దయయుంచాలి. సాటి బ్రాహ్మణ్ణి ఏదో తమరుదయ చూడకపోతే

గోపా - భయపడకండి. నా శక్తికొలది ప్రయత్నిస్తాను.

మాధవ - కరణంగారు మా అమ్మాయికోసం దయతలచండి.

రంగా - గోపాలరావు చూస్తానంటే చేశామన్నమాటే. ఏం భయపడకండి.

మాధవ - (సంతోషంగా) "అల్లాచెప్పడు బల్లూ ఆకాశం రామురాను, సజ్జనుండు బల్కు చల్లగాను" అన్నారు.

గోపా - అంటే అన్నారులేవయ్యా- తలుపులు తీసిమాట్లా చూడండి.

రంగా - చూచేదేంటండీ- ఆ దొడ్డిగోడ పాకె తీయండయ్యా

గోపా - అంతపని లేదు లెండి రంగారావుగారు ఒక పుల్ల తీసుకరండి నే తీస్తాను.

(గోపాలరావు తలుపులు తెరచును)

గోపా - (పడిపోయిన నళినినిచూచి) చచ్చి పడుందండి పాడు ముండ- ఎక్కడైనా కాగితం వ్రాసి పెట్టిందేమో వెత కండయ్యా- అలా నిలబడతారేం వెతకండి.

(కాంతారావు ప్రవేశం)

కాంతా- నళినీ !- ఓ రంగారావుగారా. ఓ కరణంగారూ వచ్చారే. ఎందుకండీ మీకు నామీద అకారణంగా దయగలిగింది. నళిని-నళిని-

మాధవ - నళినటా- నీ నళిని చచ్చిందిలేవోయ్ !

కాంతా - ఆ- నిజంగా-

గోపా - నిజంగానే కాంతారావుగారు ఆత్మహత్య చేసుకుంది అదుగో ఆ గదిలో చూడండి.

కాంతా – ( వెళ్ళి నళినిని చూచి ) అయ్యో ( పెద్దగా ) నళినీ !
( పడిపోవును )

రంగా – అయ్యో. మీ అల్లుడు పడిపోయ్యాడండి మాధవ రావుగారు.

మాధవ –అయ్యో – నాయనా !

రజని – కాంత్ !– నాన్నా ఇంకెక్కడి కాంత్ – నళినిమీదనే ప్రాణం వదిలాడు. నాన్నా నామూలంగానే కాంత్ బలియయ్యాడు. వెంకయ్యగారు– నేను కాంతారావు నుమోసగించి సుదర్శన్‌తో రహస్యంగాఉత్తరాలుజరిపా యిదుదో యీఉత్తరాలన్నీ నిజం–నళిని వ్యభిచారైనా పతివ్రతే. నేను సంసారినైనా వ్యభిచారిని. నళినీ కాంతుణ్ణి రజనీ కాంతుణ్ణిగాచేసుకుందామనుకున్నాను. నళినీ కాంతుడు రజనీకాంతుడు కావటం అసంభవం అని గ్రహించలేకపోయ్యా !

మాధవ – మహా గ్రహించావులే.

గోపా – ఇంతకు నళిని వ్రాసిన ఉత్తరం చదువరేమండీ ! – రంగారావుగారు.

రంగా – మరచిపోయ్యా చదువుతా వినండి.

“ నా నళీసికాంత్,– నిన్ను వీడిపోతున్నాను. యీ నీ ఫోటోలో నిన్ను కడసారి చూపు చూశా. నీ అనుజ్ఞ లేకుండా నీ వద్దనుండీ సెలవు పుచ్చుకున్నందుకు క్షమించు– నేను వచ్చేజన్మలోనైనా నీదానినే– నీకు నా చివరికానుకగా నీవు యిచ్చిన యీ వుంగరం– నీ ఫోటో నా అంతిమకానుక.

నేను లేని కొరత రజని పూర్తిజేస్తుంది. కాంతారావు భార్యను వీడి వ్యభిచారయ్యాడన్న మచ్చ తొలగించుకో- రజని నిన్ను తన ప్రాణాలతో సమానంగా చూచుకుంటుంది. నాజీవితంపై విరక్తితో యీ హత్య నేను చేసుకున్నా- వచ్చేజన్మలో నీ సేవకు అనుగ్రహించు- ”  నీ దాసి,

నళిని.

రజని - యింత పవిత్ర హృదయవని. స్వార్థత్యాగి వని గ్రహించలేక పొయ్యా, నిన్ను బలిగొన్నా- నళినీ క్షమించు.

గోపా - ఫరవాలేదండీ. ఎవరిపైనా కేసుపోకుండానే వ్రాసింది లెండి దొంగముండ.

రజని - ( కోపంగా ) నళిని దొంగముండగాదు. ఇంట్లో అమాయకురాలైన భార్యను అల్లాడబెడుతూ రహస్యంగా కన పడ్డ దానితో అల్లా తిరిగే నీవు దొంగవు. పట్టపగలు ఖూనీలు చేయించే నీచుడవు. నీవారేనా పెద్దలు.

నళిని - కాంత్- మీకు ద్రోహంచేశా. ( ఏడుచును )

మాధవ - ఏడవకమ్మా- జరిగిపోయినదానికేం చేద్దాం.

రజని - ఏడవకమ్మా అనడానికి నోరెలా వచ్చింది. దానికంతా మూలకారకుడవు నీవుకాదూ ! - చిన్నప్పటినుండీ నేను సుదర్శన్ బావను ప్రేమించినా,- సుదర్శన్‌కు చదువు లేదని, ఆస్తిలేదని - నీ చెల్లెలుకు మరణకాలంలో యిచ్చిన మాటగూడా త్రోసివేసి,- సుదర్శన్‌ను తప్ప వేరెవ్వరిని పెండ్లాడనన్నా వినక బలవంతంగా కాంతా

రావు కిచ్చి చేశావ్ !– నాకూ నీ మేనల్లుడికి ద్రోహం
చేసి పంపాలనుకున్నావ్ !

మాధవ – నీవు సుఖపడతావని చేశాను.

రజని – అవును సుదర్శన్‌తో సుఖపడతాననే నా మెడకు వురి
తాడు బిగించావ్ ! కాంతారావు ఆస్తిచూచి ఆ
ఆస్తంతా కట్టుకుందామని యిచ్చావ్ ! కానిఆఆస్తంతా
అప్పులక్రింద సరిపోతే నా ఆశలు అడియాసలై మా
ముఖంచూడకుండా వెళ్ళావు– ధనపిశాచి !– సుదర్శన్
పేర వుండే అరవైకరాలకే వెయ్యాలని– నేను సుదర్శన్‌పై
ప్రేమతో నీ వద్దకు వచ్చినప్పుడల్లా సుదర్శన్‌తో రహ
స్యవ్యాపారాలు జరుపుతుంటే చూచి మందలించక
పూరుకున్నావ్ ! యీసర్వనాశనానికి కారకుడవు నీవు
కాదూ– మాట్లాడవేం– నీ ధనతృష్ణ యిప్పుడైనా
తీరిందా !– సుదర్శన్ నాపై ప్రేమతో పెండ్లి చేసు
కోకుండానే నీ జీవాలకు పడి ఏడుస్తున్నాడు. కిరాత
కుడా !

మాధవ – నిజమేనే కిరాతకుణ్ణేనే ! మీ కందరికీ ద్రోహం
చేశానే !–

రజని – నళినీ– నీకు ద్రోహంచేశా! కాంతారావునుండి నిన్ను
వేరుపరచా నీ కాంతారావును బలిగొన్నా– (పిచ్చిగా
నవ్వి) నళినీకాంత్– పోవద్దు– నేనా రజనీను (నవ్వి)
పో– పో– నళిని వద్దకే పో– నే పాపిని (నవ్వుచూ దూకును)

రంగా – మీ అమ్మాయి మతి చలించిందండీ !

గోపా - పిచ్చెక్కింది.

మాధవ - అవునా- నా రజని- ఇక్కడ ఉన్నావటే రజని
గోపాలరావుగారు రజని చెప్పినట్లు ద్రోహిన్ని నేనే-
నేను గొంతు కోశా- పాపిని- నేనొక్కడినే కాదయ్యా
మాను దేశంలో నా లాంటి ద్రోహులు లక్షలకొలది
వున్నారు. పిల్ల సుఖపడాలనే దురాశతో, ఆస్తిపై
ఆశతో వాళ్ళ ప్రేమలను గుర్తించక ద్రోహం చేస్తు
న్నారు- అలా చూస్తారేం.

( రజని కాంత్- నళిని అని రజని నవ్వుచుండును )

మాధవ - మనమంతా పెద్దలం. తోటి ప్రాణాలను మన
పరువుమర్యాదలకోసం బలిగొనే పెద్దలం- మనం పతి
తులను, దీనలను అనాధలనుచూచి పరిహసిస్తాం___
కాని మన జీవితాలు మురుగుడుగుంటలై కంపుకొడు
తుంటే ఆ కంపును డబ్బుతో, పశుబలంతో కప్పి
పుచ్చుతాం- కాంతారావు నళిని ఆదర్శ ప్రేమికులు-
యీ హృదయంలేని సమాజానికి బలియయ్యారు-
నా తల్లిని నేనేబలిగొన్నా- రా అమ్మా- రజని- రా...

రజని - నళిని కాంత్ ( నవ్వి ) రా- రాను- నళినిని వదిలే
శాను నా కాంతుణ్ణి వదిలిరాను ( నవ్వును )

మాధవ- రా-అమ్మా- రా- (వెళ్లెదరు)

గోపా - యీ ముసలాడికి పిచ్చిలేచింది,

రంగా - యీ కేసు మనమీదకొస్తుందేమో!

గోపా - ( నవ్వి ) యింతభయపడే నీవు పంచాయతీ ప్రెసి
డెంటు పనేం చేస్తావయ్యా - నేను చూస్తాగా ఈ కేసు
సంగతి - పోదాం రాండి - మునసబును పిలుచుకు వస్తాం

( నవ్వుచూ వెళ్లెదరు )

సంపూర్ణం



# విజయం

## ఉద్దేశ్యం

*ప్రపంచంలో యుద్ధాగ్ని జ్వాలలు రేగుచున్నవి. ప్రపంచంలో కొన్ని దేశాలు విజయాన్ని అంటే యుద్ధాన్నే కోరుతున్నవి. కాని ప్రపంచ ప్రజలు శాంతి, శాంతి అని కలవరిస్తున్నారు. కాని ఆ ప్రజ కోరే శాంతి వారికి లభ్యమేనా?

—రచయిత

## పాత్రలు

అరుణకిరణ్— మారణాయుధ పరిశోధకుడు

శాంతికిరణ్— వ్యవసాయ (రసాయనిక) పరిశోధకుడు

కరుణాకిరణ్— పరిశోధకుల సోదరుడు

డారా— బట్లర్

సూంగా— బాల్యంనుండి ఆయింట్లో నివసించిన ఫ్ర్యాన్ వృద్ధుడు

కథకుడు— కథం పరిచయం చేయువాడు.

కథకుడు- కలకత్తాలోని కిరణ్ వంశీయులు అనాదినుంచీ విద్యా వ్యాప్తి గలవారు. ఆ వంశము లోని ప్రతివ్యక్తి ఒక విమర్శకుడో, కవియో, వర్తకుడో ధనికుడో కావడం పరిపాటి — అట్లాంటి వంశంలో ఆదిత్యకిరణ్ అనేవ్యక్తి జన్మించి పెద్దవాడై పండితుడుగా ఖండాంతరఖ్యాతి పొందాడు – ఆదిత్యకిరణ్‌కు ముగ్గురు పుత్రులు — అరుణకిరణ్, శాంతికిరణ్, కరుణాకిరణ్. పెద్దవాళ్ళగు అరుణ, శాంతికిరణులు యమ్. యస్. సి. ఫస్టు క్లాసులో ఉత్తీర్ణులై, రసాయనశాస్త్రాభ్యాసానికై అమెరికా వెళ్ళారు. చిన్నవాడగు కరుణాకిరణ్ బి. ఏ. దాకా చదివి — ఈ ఆంగ్ల విద్యాభ్యాసంవల్ల విజ్ఞానం కలుగదని అంతటితో ఉన్నత విద్యకు స్వస్తి చెప్పినాడు. అంతలో తండ్రి మరణించాడు. పిత్రార్జితమైన ఆస్తి చాలావుంది. ఆ ఆస్తిని సరిగా అజమాయిషీ చేస్తూ ఇంట్లోనే వివిధ గ్రంథావలోకనతో, కాలం గడుపుతున్నాడు, అట్లాంటిదినాల్లో ఒకరోజు ఉదయం 10 గంటలకు:-

## 1వ దృశ్యం

గూంగా- టీ బాబూ.

కరుణా- యస్.

గూంగా- కరుణ్ బాబుగారూ అమెరికానుండీ లెటర్లొచ్చాయండి!-

కరుణా- యిలా పెట్టు గూంగాతాతా!

గూంగా- (లెటర్లు ఇచ్చి) చదువుబాబూ వింటాను.

కరుణా- అరుణ్ వద్దనుండి వచ్చిందితాతా!

ప్రియమైన కరుణాకిరణ్,

నేను ఇప్పుడు రసాయనశాస్త్రంలో మారణాయుధోత్ప త్తిలో I Class ప్యాసైనాను. నేను రేపే బయలుదేరివస్తు న్నాను. నీవు మా ఇంటిలోని ముందుగూన్ను బాగా క్లీనుచేస్ చేసి పరిశోధనాసామాగ్రి నింపు—మారణాయుధాల్లో ఉన్న మారణాయుధాన్ని కనుగొన్న వారికి అమెరికా 300 డాలర్లు బహుమతి నీయవలచింది. విజయం నాదేనని వాంఛిస్తూ—

నీ అరుణ కిరణ్,

కరుణ– అబ్బా-యీవిద్యార్థినుల హృదయాలెంత పవిత్రా యాలు– వీరు వారి తెలివిని, చదువునూ మారణాయుధ పరిశోధనకు వినియోగించక ప్రజాశ్రేయస్కరమైన కార్యాలకు వినియోగిస్తె ప్రపంచం ఎంతో అభివృద్ధి చెందేది. — సంస్కారంగల అరుణ్ కూడా ధనవ్యా మోహంలో పశుప్రాయుడయ్యాడు. (నవ్వుతూ) అరుణ్! తప్పక పరిశోధనకు అనుకూలంగా రూమ్ క్లీన్ చేస్తా. ప్రపంచనాశనానికి దోహదం చెయ్య– (ఆలోచనగా అగును.)

కరు– ఓ యీ ఆలోచనలో శాంతి కిరణ్ లెటరు చదవడమే మరిచా.... From శాంతి

'నా ప్రియమైన కరుణాకిరణ్'

నేను రసాయనశాస్త్రంలో వ్యవసాయ పరిశోధనలలో ఫస్టుక్లాసులో ప్యాసయ్యాను. అరుణ్ నేను రేపే బయలుదేరి వస్తున్నాం, అరుణ్‌ను మెడిసన్ పార్టు తీసుకోమని ఎంతచెప్పిన

వినక మారణాయుధ పరిశోధనచేయ్యాలి—నేను కొత్తరకం ఎరువును కనిపెట్టదలిచా – నాకు వేరేగదిలో యీలెటుమకోసి లిష్టుచూచి ఆసామానులతో నారూమ్ సర్దేష్ చెయ్యి"

కరుణ– ReallY you are my brother, శాంతా! నీవు చేసే శాంతి పరిశోధనవిజయవంతం కావాలి–నీపేరు సార్థకం– గూంగా తాతా!

గూంగా– Sir

కరుణ– కారు రెడీచెయ్యమని డ్రైవరుకు చెప్పు. నేను సైన్సు లేబరేటరికి వెళ్ళి సామాను తేవాలి–

గూంగా– సరే బాబూ

కరుణ– తాతా!

గూంగా– బాబూ

కరుణ– యీసైడ్‌లోని జంటరూములు బాగా క్లీన్ చేసి ఖాళీచెయ్యి.

గూంగా– సరేబాబూ (వెళ్ళును)

(బయటనుండి) కారు రడీఅయిందిసార్.

కరుణ– Yes వస్తున్నా. (కారు స్టార్టుఅయి వెళ్ళినధ్వని)

## 2వ దృశ్యం

కథకుడు– సోదరుల ఆజ్ఞప్రకారం ముందు గదులలో వేరువేరు పరిశోధనాగదుల నేర్పరచాడు కరుణా కిరణ్– అమెరికానుండివచ్చిన ఆకిరణ్ సోదరులకు కలకత్తా లోని

ప్రభుత్వము ఎంతో గొప్ప సన్మానాలు జరిపారు. ఒక శుభ ముహూర్తంలో ఆసోదరులిద్దరు తమ పరిశోధనలను ప్రారంభించారు. కొంత కాలం గడిచింది. ఒక నాడు. ఉదయం సోదరులిరువ్వరూ వారిపరిశోధనలలో లీనమైనారు. అప్పుడు—

గూంగా- శాంతిబాబూ టీ.

శాంతి- ఊఁ.

గూంగా- టీ బాబూ

శాంతి- Yes వెళ్ళు తాతా!

(గూంగా వెళ్ళును. స్పిరిట్ లాంపు మండుచుండును.)

(కరుణా కిరణ్ ప్రవేశం.)

శాంతి- ఊఁ. ఎవరు!- కరుణా!

కరుణ- శాంతీ - యీ టీ యిక్కడనే వున్నది. టీ చల్లారిపోతున్నది.

శాంతి- ఆ—చల్లారుతుంది. కాని, కొంతవ్యవధి.

( స్పిరిట్ లాంపు మంట—పరిశోధన చేస్తుంటాడు. )

కరుణ- ఆచల్లారేదేమిటి శాంతీ?

శాంతి- ఆకలిమంటలు.

కరుణ— శాంతీ! ఏమిటీమాటలు నీవు రోజు రోజు కు పిచ్చివాడివై పోతున్నావ్!

శాంతి- లోకందృష్టిలో శాంతికాముకులంతా పిచ్చివాళ్లేకరుణా!

(స్పిరిట్ లాంపు వేగంగా మండును. సామాన్లు అటూఇటూ, తీయుచుండును. బుస్ మని పొంగిసధ్వని ఒక్కసారిగా హెచ్చు)

ఆగిపోవును.)

శాంతి- (నవ్వుచూ) నీ శాంతికి విజయం లభించింది కరుణా! కరువురాక్షసిని పారద్రోలే ఆయుధం దొరికింది. యీ పౌడి, యీపౌడి, నా పరిశోధనా ఫలితం. తడివిత్తనా లకు తగులగానే మొలకెత్తుతవి కరుణా! యీ ఎరువు వాడితే నీరుతో ఎక్కువ అవసరం లేకుండానే పంటలు పండుతాయి.

కరుణ- ఎప్పటికైనా శాంతికాముకుడిదే విజయం శాంతి!

శాంతి- (నవ్వుచూ) ఐకెంచంద్రుడన్నట్లు మనదేశం "సస్యశ్యామలం" (నవ్వుచూ) విజయం నాదే-

(టీ ప్లేటు దొర్లును.)

కరుణ- అయ్యో కప్పు బద్దలైంది. టీ నేలపాలైంది.

శాంతి- (నవ్వుచూ) కరుణా నాపరిశోధనాఫలితాన్ని ప్రభుత్వానికుచితంగా యిచ్చేస్తా! నా దేశంలో రేషన్‌షాపులు ఎగిరిపోతాయ్! దేశంలో శాంతి వ్యాపిస్తుంది. ప్రపంచం కోరే శాంతి నాదేశానికే దొరికింది- కరుణా విజయం నాదే- నవ్వు- కరుణా నవ్వు.

(ఇద్దరూ నవ్వుతుంటారు - వారి నవ్వుచీల్చుకుంటూ వికటంగా అరుణ కిరణ్ గదినుండీ నవ్వు వినపడుతుంది.)

కరుణ- అరుణ్ నవ్వుతున్నాడో, ఏడుస్తున్నాడో, నాకే తెలియడం లేదు! అరుణ్ ఆవేశంలో ఏదో ప్రమాదానికి గురై యుంటాడు- శాంతీ! నే అరుణ్ రూమ్‌కు వెళ్ళుతున్నా- (వేగంగా పరుగెత్తును.)

# 3 వ దృశ్యం

(వికటంగా అరుణ కిరణ్ నవ్వుచుంటాను. గ్యాస్ ధ్వని వినపడుతూంటుంది.)

కరుణ— My god ప్రయోజనం లేదీవాళకు. యీసోదరులు పరిశోధన సాగిస్తె తమ ఒళ్ళేమరుస్తారు— కీళ్ళ మూలంగా నాకు పిచ్చెత్తేట్టుంది, —అరుణ్—

(“బుస్” మని గ్యాస్ ధ్వని)

అరుణ— (కరుణరాక గుర్తించకనే) నాపరిశోధన ఫలించింది. అమెరికా సైంటిస్టు బహుమానం నాదే — ఎవరు— కరుణా! నీవా (నవ్వుచు) ప్రపంచంలో విజయసాధనానికి స్థానం లభించింది. యీగ్యాస్ వదిలితే చాలు ఒక్కక్షణంలో సర్వనాశనం (నవ్వుచూ) విజయంనాదే మైడియర్ బ్రదర్.

కరుణ— (ఆవేశంగా) విజయం నీదికాదు అరుణ్! శాంతి పరిశోధకులదే! ప్రపంచంలో వారికే స్థానం— శాంతికేస్థానం.

అరుణ్— (కోపంగా) శాంత!—— ప్రపంచంలో శాంతి ప్రవేశిస్తే ప్రపంచం నిర్జీవమైపోతుంది. మంచుగడ్డలా స్థంభించిపోతుంది. ప్రతిదేశం, ప్రతివ్యక్తి కోరేది విజయం,

కరుణ— లేదు. ప్రతిదేశపు ప్రజలు కోరేది శాంతి!

అరుణ్— ప్రజలు— సంస్కార రహితులు. విజయంవిలువ వారికేం తెలుస్తుంది. (అమూఢప్రజతో నాకు పనిలేదు

కరుణ— మీబోటివారికంటె ఆమూఢ ప్రజలే నయం. వారికి

హృదయముంది.

అరుణ— పొరపడుతున్నావ్ కరుణా! మనకు కావలసినది దేశం, ప్రపంచం.

కరుణ— ప్రజలే దేశం, ప్రజలే ప్రపంచం.

అరుణ— ప్రజలు—విజ్ఞానంలేని మట్టిబొమ్మలు, నాపరిశోధనలు వారికోసం కాదు — సంస్కారవ హృదయులు కోరిన విజయం. వారేదేశస్థులైనా సరే వారికోసమే నాపరిశోధన.

కరుణ— మీబోటి వారికంటే అజ్ఞానమైన కసాయివాడే నయం కసాయి జంతువును చంపుతాడు తన ఆహారం కోసం. కానీ మీరు మానవులనే చంపుతారు పదవులకోసం, కీర్తికోసం, డబ్బుకోసం.

అరుణ— (కోపంగా) కరుణా!

కరుణ— నీవు— మానవ మారణానికి ప్రయత్నించే ద్రోహివి. ఛీ! నీవు నాసోదరుడవా!

అరుణ— ఆపు— కరుణా! ఆపు! నాకు కావలసింది ధనం— నీవే కాదు. నీలాంటి వాళ్ళంతా నన్ను నిందించినా నేకోరేది ధనం—యీ నాపరిశోధన విజయవంతమైంది- నావాంఛ తీరుతుంది. ఏదేశమైనా నాపరిశోధన కోరుతుంది. కొంటుంది. అమెరికా బహుమానం నాదే!- (నవ్వుచూ) నేల తొడిగా రినట్టా! లక్షలు—ధనం- (నవ్వి) విజయం కోసం పాటుబడే ఏదేశమైన అడిగితే యిచ్చేస్తా కొన్నిలక్షలకు.

కరుణ—అరుణ్ నా తల తిరుగుతుంది.

(ఆవేశంలో నాదే విజయం – నాదేవిజయము)

కరుణ– అబ్బా – అరుణ్– చాలించుము మూర్ఖుడను–అరుణ్

అరుణ్ (ఆవేశంగా నవ్వుతూ) సంస్కారులు కోరేది విజయం, ప్రపంచం పుట్టింది విజయంలో! పెరిగింది విజయంలో, ప్రపంచం కోరేది విజయం.

కరుణ– అరుణ్ !

అరుణ– ప్రపంచానికి విజయం లభిస్తుంది. నాకు ధనం (వికటంగా నవ్వును.

కరుణ– అబ్బా (గాజుసామాను పై పడును)

'అబ్బా' (అన్నమాట విని శాంతికిరణ్ తెరలో) కరుణా! నే వస్తున్నా

అరుణ– నాకు కావలసింది ! (ఆగి) అయ్యో! కరుణా! నెత్తురు– గ్యాస్ బాటిల్ పగిలింది– ఎంతపని జరిగింది కరుణా!

(శాంతిప్రవేశం)

శాంతి– అరుణ్ ఏమటిదంతా!– కరుణా! నా తమ్ముణ్ణేంచేశావు అరుణ్ ! అయ్యో (కరుణ) తలపగిలింది– (కోపంగా) అరుణ్ నీ మారణ పరిశోధన సోదర రక్తంతో పూర్తిగా విజయవంతమైంది గదూ!

అరుణ– శాంతీ !

శాంతి– నీకు మానవ హృదయం లేదూ! నా తమ్ముణ్ణి నీవే బలిగొన్నావ్ ! నీ విజ్ఞానం పుస్తకాలు డిగ్రీలు ఇందుకేనా! పలుకవేం ? నీ విజయవాంఛ– ధనతృష్ణ

తీరిందా ! (కోపంగా)

అరుణ్‌- శాంతీ ! అవు

శాంతి- నీ పరిశోధన మానవనాశనానికా ? శాంతికా ?

అరుణ్‌- నాకు శాంతితో పనిలేదు. నే కోరేది విజయం,

శాంతి- (కోపంగా) విజయం సాధించి మీరేంచేస్తా రీ మానవ శూన్యమైన మంటిగడ్డను.

అరుణ్‌- మిగిలిన వారమే అనుభవిస్తాం! శాంతి నిండి ప్రపంచం నిర్వీర్యమైపోతుంటే చూస్తూ వూరుకోలేను. శాంతిని నాశనంచేస్తా ! విజయానికి దోహదంచేస్తా !

శాంతి- (వికటంగా) విజయ- ఆవేశంగా) యిదుగో నీవిజయం. యీ నెత్తురేగదూ ? నీవు కోరే విజయఫలితం. నా సోదరుని బలిగొన్న నీపరిశోధనా పరికరాలను సర్వ నాశనంచేసి తీరుతా- యీ సామానంతా నా తమ్ముడు కరుణ తన మరణంకోసం సిద్ధంచేశాడు- యీ సామా నంతా నాశనంచేస్తా ( వికటంగా నవ్వుచూ సామాను పగులగొట్టును) (గాజుసామానులు పగిలిపోవుచునవ్వు)

అరుణ్‌- (వికటంగా నవ్వి) శాంతీ ! బద్దలు చేసేయ్ ! అన్నీ నాశనం చెయ్యి ! నా పరిశోధన యిదివరకే విజయ వంతమైంది- నా హృదయంలోని పరిశోధనను నీవేం నాశనం చేస్తావు ? (వ్యంగ్యంగా నవ్వుచుండును)

శాంతి- నిన్నే బలిచేస్తా ! మానవద్రోహీ !- ఆగు- (అరుణ్ పరుగెత్తబోవును శాంతికిరణ్ అరుణ్‌ను పట్టుకొనును యిద్దరు పెనుగులాడుదురు.

శాంతి– ఆ– అపిష్టల్ అందుకోదలచావా! ఆహా నీకా అపిష్టల్ దొరికేది.

అరుణ్– ఊఁ (టేబిల్‌పై పిష్టల్ తీసికొని) దొరికింది– (వికటంగానవ్వి) శాంతి పరిశోధనఫలితం (పిష్టల్ పేల్చును.)

శాంతి– అబ్బా– అరుణ్ కాల్చావా! ద్రోహి (పడిపోవును.)

అరుణ్– (వికటంగా నవ్వి) ఒక్క– చీడపురుగు నాశనమైంది శాంతి– శాంతి! కావాలట?

కరుణ– (సగంలేచి) శాంతీ! శాంతి! అయ్యో! ఎంతపనిచేశావు అరుణ్

(అరుణ్ వికటంగా నవ్వుచుండును)

కరుణ– అయ్యో ప్రపంచాన్ని విడిపోయ్యావా శాంతి! నీపరిశోధన ప్రభుత్వానికివ్వకుండానే పోయ్యావా! శాంతీ! (ఆవేశంగా) అరుణ్! నవ్వు– యింకానవ్వు– నాకు విజయం పూర్తిగా దొరికింది, శాంతి నీసోదరుడుకాడూ– రాక్షసుడా! పలుకవేం! నీరక్తదాహం తీరిందా!

(అరుణకిరణ్ వికటంగానవ్వుచూ వెళ్ళును.)

కరుణ– నీచుడా! నవ్వుతూపోతున్నావా? (పిచ్చిగా నవ్వుచూ) శాంతీ! నన్ను వదలిపోతున్నావా!

అన్నా- నేనూవస్తా ఆగు- నాశాంతి ప్రపంచం నుంచే వెళ్ళిపోయ్యాడు. నాశాంతి నేంచేశారు? అరుణ్!నవ్వు శాంతీ-రావ్రా! నేవస్తున్నా శాంతి (పిచ్చిగా నవ్వును.)

(పడిపోవును- అరుణ్ ప్రవేశం.)

అరుణ్- (దీనంగా) తమ్ముడూ! కరుణా! శాంతీ! పలుకరు! (పిచ్చిగా) శాంతీ! కరుణా! నాపై మీకుకోపమా!___ అయ్యో నన్ను ఒక్కణ్ణి వదిలి మీరిద్దరూ వెళ్ళి పొయ్యారా! శాంతీ! కరుణా నేనూ మీతో వస్తాను ఆగరూ! (పిచ్చిగా నవ్వుచూ) శాంతీ! నాదేవిజయం__ నాదే విజయం.

కరుణ- (చిన్నగా కండ్లుతెరచిచూచి) అరుణ్ నీదావిజయం? (కండ్లు మూయును.)

అరుణ్- కరుణా నాదిగాదు విజయం- శాంతిదే! కరుణా పలకవ్రా! అయ్యో! (పెద్దగా) అంతా పొయ్యారా! నన్ను ఒక్కణ్ణిచేసి పొయ్యారా! (పెద్దగా) శాంతీ!

గూంగా- (ప్రవేసించి) అరుణ్ బాబూ! యిదేంది చూడు! నెత్తురు-చూచి యిదేం ఘోరం బాబూ అమెరికా కెళ్ళి చదివినఫలితం యిదేనా బాబూ!

అరుణ్- నాకు శాంతిగావాలి! (పెద్దగా) నాకు శాంతిగావాలి.

కరుణా! శాంతీ! నేనూ మీతో వస్తా- (పిస్తోల్ తో కాల్చుకొని పడిపోయి) అబ్బా- శాంతీ! నాకు శాంతి గాంగా రారా!

గాంగా- కావాలి—అయ్యో! బాబూ! (కళ్లుమూయును) కాల్చుకచచ్చావా! అరుణ్ బాబూ! యిదంతా అయో మయంగా వుంది. నాతల తిరిగిపోతుంది, నేనుచూడ లేను చిన్నప్పటినుండీ యీముగ్గురిని నేపెంచి పెద్దచేశా! చివరకు నాకండ్ల ఎదుటనే మరణించారు- శాంతిబాబు శాంతి శాంతి అంటూచచ్చారు. అరుణబాబు మారణాయుధాన్ని కనిపెట్టాడు. ఆమారణాయుధమే యీ కిరణ్ వంశాన్ని మారణంచేసింది- మారణాయుధాలతో కలిగేలాభం యిదే! శాంతి కావాలి. ప్రపంచానికి శాంతి కావాలి. విద్వేషాలతో మారణాయుధాల సృష్టించి సర్వనాశనానికి దారితీస్తున్నారు- శాంతిరాదా ప్రపంచానికి శాంతిరాదా!

## గేయం

గాంగా- రాదా!
శాంతీ!

ప్రపంచానికే; ॥రాదా॥

యుద్ధజ్వాలల

కీలలలోన

మరణించాలా ॥రాదా॥

మారణాయుధాల్

మారణహోమాల్

సమసిపోవ్యాడి

త్రోవేలేదా ॥రాదా॥

—o—

సంపూర్ణం.

# దేశద్రోహి

[ చరిత్ర నాధారముగ జేసుకొని కల్పితించినది ]

## -: పాత్రలు :-

| | |
|---|---|
| జయచంద్రుడు :- | కనోజిరాజు |
| పృథ్వీరాజ్ :- | ఢిల్లీరాజు |
| హాహులిరాయుడు :- | ఢిల్లీరాజ్య సేనాపతి |
| మహమ్మద్ ఘోరి :- | తురుష్కరాజు |
| జఫ్ లఫ్ ఖాన్ :- | ఘోరీ సేనానాయకుడు |
| ఇతర భటులు :- | రాజకుమారులు. |

## -: స్త్రీలు :-

| | |
|---|---|
| రాణి సంయుక్త :- | కనోజీరాజు కుమార్తె |
| సునీత :- | సంయుక్త సేవకురాలు. |

# 1 వ. రంగము

## 1 వ. దృశ్యము.

కనోజిరాజకోట పచ్చనిమామిడి తోరణాలతో అలంకరింపబడి యుండును, యెచ్చటజూచిన మంగళవాయిద్యముల మోతలు వినబడుచుండును, రాజమందిరము కోలాహలముగ యుండును. దర్బారులో యెత్తైనసింహాసనముపై జయచంద్రుడు ఆసీనుడై యుండును. ప్రక్కన పదునారేడుల యువతి సర్వాలంకారశోభితయయి కూర్చొనియుండును. సింహాసనమునుండి జయచంద్రుడు లేచి దర్బారులోని రాజకుమారులనాదేశించి"

నాఆహ్వానమంపిన తోడనే మీరందరు యీస్వయంవరమునకు దయచేసినందులకు నా ధన్యవాదములు, ఇదిగో యీమె నాయేకైకపుత్రిక. సంయుక్త. యీరాజమందిరము లోని, రాజకిశోరములలో యేవొక్కనినైన వరించి, వివాహంబాడి, ధన్యతనొందుగాక!

అమ్మా! యిదిగోపూలహారము. నీవలచినవానిమెడలో వేయుము.

సం - ( "సిగ్గుతో" తలవంచుకొని ) సేవకురాలయిన సునీతి వెంటరాగ, మెట్లుదిగి ఒక్కొక్కరినిజూచుచు, మందగమనంతో పోవుచుండును. అదృష్టఫలము నాశించిన ప్రతిరాజకుమారుడు, ఆమె తనను దాటినడువగనే, నిస్పృహతో, నిరాశయుకై చతికిలబడును. వాకిలికడ పరాభవముచేయుటకై శిలాప్రతిమనుజేసి, ద్వార

పాలకునిగ నియమించిన పృథ్వీరాజు ప్రతిమను గాంచి
(తనలో) ఓరా! నాతండ్రి యెంతటి మూర్ఖుడు.
భారతవీరకిశోరమునకీ యవలసినదా, యీపాటు.
(ఉద్రేకముతో) పూలమాల మెడలోవైచును.

జయచంద్రుడు- (ఆవేశంతో) ఛాండాలి! మూర్ఖురాలా! నా కడుపు చెడబుట్టితివి. నాకు ఆ గర్భశత్రువు, నావాకిలి కాయుటకునైన అర్హతలేని ఆనీచుని మెడలోనా నీవు పూలహారము వేయుట.

సం- తండ్రీ! ఆగ్రహింపకుము. నీయిష్టమువచ్చినవాని వలచి, ఆతని మెడలో వేసుకొనుమని ఆజ్ఞయిచ్చి తిరిగదా!

జయ- అంటే: నీచుడు, నాకు ఆగర్భశత్రువు, పైన దీపంలేని ఆ నిర్జీవ ప్రతిమకా వేయవలసినది.

సం- తండ్రీ: అది శిలాప్రతిమ అయినను, మనరాజమందిరములోని ప్రస్తుత జీవప్రతిమలకన్న తేజోవంతమైనది. నన్నాకర్షించినది. నేను వరించితిని నా మనోసుమము యిక ఆతని యధీనము. దీనినెవ్వరూ తప్పింపజాలరు.

జయ !- ఛీ! వాచాలినీ! నోరుమూయుము. కనోజిరాజవంశ కిరణ చంద్రికలకు మచ్చతెచ్చి, నాకు తలవంపులు తెస్తివా- బాల్యముచేత నీవాపనిని చేసితివని, క్షమించితిని. కుమారీ- నీ యిచ్చవచ్చిన మరొకరిని వరించి సుఖంపుము, అకారణముగ నాకోపదవానలమునకు ఆహుతి కాకుము.

సునీతీ! ఆ పూలహారమును తీయుము. (సునీతితీయబోవును)

సం - ఆగుము సునీతీ! భారత వీరకిశోర కంఠహారము నందు కొనుటకు, తగిన వీరనారియే సమర్థురాలు- నీవు సేవకు రాలవు. ఆ ప్రతిమను అంటుకొనకుము. ఇది నా ఆజ్ఞ.
( సునీతి తెల్లముఖమునైచి చూచుచుండును)

జయ - (తోకతొక్కిన తాచువలె మండిపడుచు) ఓసీ! అవివేకీ, నా కుమార్తెవని యింతవనుక సహించితిని. ఇటు సూర్యుడు, అటు పొడచినను, పరమ నీచుడైన పృథ్వీ రాజు నాకల్లుడు కాజాలడు, ఓరీ! యెవడురా అక్కడ!

భ :- ప్రభూ! ఆజ్ఞ.

జయ - యీ మూర్ఖురాలిని కారాగారమున బంధింపుము కామపిశాచి నెత్తికెక్కుటచే, కన్నతండ్రినయిన నన్ను కూడఅవమానించుచున్నది. కనూజీసార్వభౌముని ఆజ్ఞా తిరస్కార ఫలితమని, యేడ్చి, కృశించి, క్షమింపుమని అడుగునంతవరకు, కారాగారమే దీనికి నివాసము. అంతఃపురమునకు అర్హురాలు కాదు. ఊ—ము. పొండి! (బయటనుండి, గుర్రపుడెక్కల చప్పుడు వినబడుటచే, అందరు నివ్వెరపడి. జూచుచుందురు. బయటనుండి రణహయారూఢుడై, శిరస్త్రాణము, కత్తి, డాలు ధరించి, వీరరసముట్టిపడ, దర్బారులోని రాజకుమా రుల తేరిపారజూచుచు పృథ్వీరాజ్ ప్రవేశించును.)

పృ - మామా! జయచంద్ర: ముద్దులకుమారి కివ్వవలసిన శిక్షయేనా? ఢిల్లి సార్వభౌమురాలు. రాణిసంయుక్తకు కారాగారమా నివాసము? (అంటూ సంయుక్తను గుర్రముపై నెక్కించుకొని దర్బారు నుద్దేశించి) ధైర్య-

వీర శిరోమణులెవ్వరయినను, యెదుర్కొనవచ్చును.
(అంటూ పోయి తన గుడారమును జేరెను.)

2 వ దృశ్యము

పృథ్వీరాజ్ శిబిరము

చుట్టూ భటులు కాపలా కాయుచుందురు. లోపల సంయుక్త తూగుటుయ్యాలపై పవళించి ఆలోచించుచుండును. వెనుకనుండి పృథ్వీరాజ్ ప్రవేశము.

పృ - దేవి ! సంయుక్తా ! యేమి విచారముగా నున్నదా ?

సం - లేదు ప్రభూ ! నా తండ్రి పొరపాటుకు చింతించు చున్నాను.

పృ - మామగారికి యేలనో, నాపయి అంత ఆగ్రహము.

సం - ఈర్ష్యా అవివేకములు పెనవేసుకొని పెరిగిన సంకుచిత హృదయులకు, ఆగ్రహా, అనుగ్రహాలకు కారణములు యేముంటవి ప్రభూ !

పృ - నీ తండ్రి యిష్టానుసారముగ, నీవు వేరొకనిని యేల వరింపవయితివి?

సం - మీ వీరవిహార గాధల విన్న, నా హృదయము యిది వరకే మీకంకితమయినది. అట్టిచో అన్యులపై వు దృష్టి యెట్లు మరలును. అదియునుగాక, భారత వీర నారి వరింపవలసిన, వీరపురుషుని వరించితిని. నా జీవితము ధన్యమయినది.

పృ - దేవి ! నీవంటి వీరపత్నిని వివాహమాడుటచే, నా జీవితము ధన్యమయినది. నీవు నా హృదయరాణివి.

(ఇంతలో బయట రణకోలాహలములు వినబడును,
పృధ్వీరాజు ఆయుధమును దరించి)
ఓరీ! యెవడురా అక్కడ.

భ - ప్రభూ! శెలవు.

పృ - గుడారమును అతిజాగరూకులై చూడండి. లోపల
దేవి వొంటరిగా యున్నది. (హయము నెక్కిపోవును)

(యుద్ధభూమిలో జయచంద్రుడు, పృధ్వీరాజ్ ప్రవేశము)

జయచంద్రుడు - ఓరి! చోరుడా! భీరుని పగిది పరుగెత్తితివి.
రమ్ము నీ పీచ మడంచెదను. ఆ డబానిని గుర్రమెక్కిం
చుకొని పరుగెత్తుట, వీరత్వమా- పిరికిపంద- నిల్లు,నిలు

పృ - మామా! నిలువక నేనెక్కడికిని పారిపోవుట లేదు.
జరిగినదేదో జరిగినది. ఇప్పటికైనను అనుగ్రహించి,
మా కళ్యాణమును నీ చేతులమీదుగ జరిపి మన
రాజగౌరవముల కాపాడుము.
నీవెంత అంగలార్చినను సంయుక్త నా రాణి. బాగా
యోచించి కదనరంగమునకు దిగుము.

జ - ఆ! ఆలోచించితిని నీ కంఠమును నా కరవాలముతో
నరికి, ఆ రక్తవారినుల, నా రాజవంశమునకు నీ మూాల
కముున వచ్చిన మచ్చను మాపుకొందును. జడుడా!
కనూజ్ రాజచంద్రునకు అల్లుడగుటకు నీకు తగిన
అర్హత గలదా!

పృ - త్వరపడి, తదుపరి విచారించిన ప్రయోజనము లేదు,
యుద్ధము చేయుటయే నీ తలంపయినచో, నేనందుకు
సంసిద్ధుడనే. సంయుక్త ముఖము చూచి ఇంతవరకు

చెప్పితిని. ఢిల్లీ సార్వభౌమ కరమకత్తుల తీవ్రత నీకు తెలియకపోలేదు.. పాపము ఈర్ష్యా భ్రాంతులచే నన్ను చంపుదునని కలలు గనుచున్నావు.

జ – సహాహా! స్త్రీతో సంభాషణ అనవసరము సహాప్రువాపి నా కుమారిని తెచ్చుకొందును – భటులారా రండు- బంధింపుడు–నరుకుడు...

పృ – పాపము! వృన్మాదము- నేనేమి చేయగలను.

(యుద్ధము ముగియును. జయచంద్రుడు పారిపోవును. తిరిగిశిబిరమునకు ప్రవేశించి, పృథ్వీరాజ్ కుర్చీలో ఆసీనుడగును)

సం– ప్రభూ! ముగిసినదా యుద్ధము?

పృ– ఆ! కనూజ్ రాజచంద్రుడు పలాయనమంత్రము పఠించినాడు. మనము నిర్విచారముగ ఢిల్లీకోటను చేరవచ్చును, ప్రియా! లోపల విచారమేమియు లేదుగదా!

సం– నాతండ్రి అవివేకమునకు తప్ప యింకేమియు విచారము లేదు.

పృ– నీవు నాజయలక్ష్మివి. సంయుక్తా- యిది నీప్రేమ బహుమానము.

తెర వాలును,

## 2 వ రంగము

### 1 వ దృశ్యము.

(ఢిల్లీకోటలోని రాజమందిరము. రాణీ సంయుక్త సేవకురాలు సునీతి ప్రవేశము.)

సం- చెలీ! నీరాక మాతండ్రికి తెలియదా.

సునీతి- లేదు! రాణి

సం- కనోజీలోని మన వారందరు క్షేమమా- నాతండ్రి యింకను ఆగ్రహముగానే యున్నాడా! లేక యేమైయిన మార్పుకలిగెనా?

సునీతి- రాణీ! నీకు తెలియనిదేమున్నది. అల్లుని పై కక్షతీర్చు కొనుటకు పగబట్టిన నాగుబాము బుసకొట్టుచున్నట్లు, సమయముకొరకు వేచియున్నాడు. పాషాణహృదయుడు, యెప్పుడు నీ పేరును సహించడు తలంపడు. మీ వంశనాశనము చేయుదునని ప్రతిజ్ఞలు బూని యున్నాడు.

సం- అమంగళము శాంతించుగాక. నావిధి-కాచేని నాతండ్రికి నేనేమి అపకారమొనర్చితిని. నే వలచినవానిని వివాహ మాడుట తప్పా? స్త్రీజాతి యెంతనీచముగ పరిగణింప బడుచున్నది. కేవలము పురుషుల బానిసలగుటకే సృజింపబడితిమా- నీవు తిరిగివెళ్ళినప్పుడు మా తండ్రికి నానమస్కారములు తెలుపుము.

సునీతి- చెల్లీ! నేను తిరిగివెళ్ళుటకు రాలేదు. నీవులేని ఆరాజ భవనము నాకు అరణ్యప్రదేశమయినది, నేను యిచ్చ టనే యుందును. అనుజ్ఞ.

(పృథ్వీరాజ్ ప్రవేశించును.)

పృ — సంయుక్తా! దీనికింతగా ఆమె బ్రతిమాలవలెనా

సం — సరే:

(ఇంతలో భటుడు లోనికి ప్రవేశించును)

భ - మహారాజా ! మనసేనాధిపతి హాహూలిరాయుడు లోనికి అనుజ్ఞకై వేచియున్నాడు.

పృ - సత్వరము లోనికి గొనిరమ్ము.

( సంయుక్త, సునీతులు నిష్క్రమింతురు. )

హా - మహారాజునకు జయము! జయము!

పృ - సేనాధిపా ! విశేషము లేమి.

హా - నూతన విశేషము లేమియు లేవుగాని ప్రభూ ! పరదేశీయుడు తురుష్కుడొకడు మనపై దండెత్త నున్నాడని తెలియవచ్చినది,

పృ - వాడెవరు ?

హా - వాడెవడో, ఘోరియట

పృ - మనమిప్పుడేమి చేయుదము

హా - తోడి రాజపుత్రుల హెచ్చరించి, మనకట్టుదిట్టములలో మనముండిన వాడేమి చేయగలడు?

పృ - అయినచో ! జయచంద్రుడు మనలో కలియునా ?

హా - కలియక నేమిచేయగలడు. పరదేశీయుల పాదముల బ్రాలునా ? యైనను అందరితో పాటు కబురంపుదము.

పృ - తగు యత్నములో నుందుము,

హా - శెలవు: మహారాజా శెలవు.

2-వ దృశ్యము

స్థానేశ్వర యుద్ధభూమి జయచంద్రుడు మినహా, రాజపుత్రులందరు యేకమైరి. ఉభయసైన్యములు బారులు

తీరినవి.

(మహమ్మద్ ఘోరీశిబిరము, సేనాధిపతి జఫ్‌లఫ్ ఖాన్ ప్రవేశము.)

జ- సర్కార్ : పృథ్వీరాజ్‌కు సైన్యము మన సైన్యముకు రెండింతలు వుండది సర్కార్ మనకి గెల్పు నమ్మకము తగ్గు. వచ్చినదారి పటితే లాభం సర్కారు.

ఘో - మూమూచ్-బేకూఫ్-శుభంఅంటూ యిద్దానికి వెళ్తూ అశుభం పల్కుతావేమి. అరే! అల్లాదయ యుండాలిగాని, కాఫరులకి నీళ్ళు తాగించము.

జ - వాళ్ళకి మనం యేమి తాగిస్తాము గాని, సర్కార్ మనకి వాళ్లు తాగిస్తార్.

( భటుడు ప్రవేశించును. )

ఘోరి- రాజపుత్రుల సైన్యమును పూర్తిగా చూచితివా.

భటు- చూచాను సర్కార్- బహులచ్చల్ వుంది సర్కార్. అరే అల్లా యెక్కడిఘోడాలు, యెక్కడి యేనుగలు, యేమిర్సునం, నేలకి యీనినట్లు అయింది సర్కార్.

ఘోరి- బయట కత్తుల ధ్వని వినబడుతున్నది. ధైర్యము గ పోరాడండి కాఫరులచంపితిమా-అల్లా ఆనందపడతాడు. చచ్చితిమా స్వర్గముచేరుతాము. భటులందరిని పిలచి యేకంగా పోరండి. అల్లా మనకి సహాయముచేస్తాడు. ఊ- ము- దూకండి.

పృథ్వీరాజ్ శిబిరము - సేనాధిపతి ప్రవేశము.

సేనాధి- ప్రభు: యీఘోరీసైన్యమును చూచివచ్చుటకు మన భటుల పంపినాను.

పృథ్వి- తురుష్కులు అతిధైర్యము కలవారంటారు. మనము తీవ్రముగా పోట్లాడాలి సుమా!

సేనాధి- వారిధైర్యమెంతవరకు ప్రభూ! నెత్తురుచూస్తే పరారవుతారు. వారి పోరు, త్యాగము, నెత్తురు కనబడనంతవరకే-

(భటుడు ప్రవేశించును.)

పృ- ఘోరీసైన్యమును పూర్తిగా చూచితివా?

భటుడు-చూచితిని మహారాజా- మనసైన్యములో సగముండును. మన భారతవీర, కరకుకత్తుల రుచికొరకై వేచియున్నది. ప్రభూ!

సేనాధి- సరియె! నీవుపోయి మనవారందరిని తగు జాగరూకతతో తిరుగమని చెప్పుము- ప్రభూ! నేనందరి రాజపుత్రుల గుడారములలోనికి పోయి హెచ్చరించి వచ్చెదను. హిందూదేవాలయముల కొల్లగొట్టిన పరమనీచులు, వీరికి తిరిగిబుద్ధిచెప్పి భారతదేశములో మరల అడుగు పెట్టకుండ చేయవలెను, శెలవు.

(ఘోరమైన పోరు జరుగుతుంది. మహమ్మదీయ సైన్యములు చెల్లాచెదరయి పారిపోతవి. రక్తసిక్త ఖడ్గముతో పృథ్వీరాజు హాహ్వాలికాయుడు. మరికొందరు రాజపుత్రులు ప్రవేశింతురు.)

హా- ప్రభూ! ఘోరి నీరుగ్రాగినాడు, చూచితిరా- తురుష్కులు యెంతపిరికిపందలో- తురుష్కులు బింకములు పల్కుటతప్ప, క్రియాశూన్యులు. మనవీరదళము తురుష్కుల మస్తకముల నుగ్గునుగ్గుగావించినది.

పృధ్వీ- అంతయు సోమనాథేశ్వరుని కరుణాప్రభావము. లింగ మును ముక్కలుచేసి, మసీదునువేసిన మహా పాపము వూరక విడచునా? స్వమతమునకై అన్యమత ద్వేష విద్రోహులు, అనుభవించదగిన ఫలమిదే.

రాజపుత్రుడు— ఈజన్మలో మరల యిటు దండయాత్రరాడు.

2 వ- "చావుదప్పి కన్నులొట్టపోయి" బయటపడినాడు,

(జయజయధ్వనులతో ఢిల్లీకోటను జేరుదురు.)

## 1 వ. దృశ్యము.

(కనోజిరాజభవనము - జయచంద్రుడు - ఆతని మంత్రి ప్రవేశము-)

జయ- విన్నావా?ఘోరి, ఓడిపోయి పారిపోయినాడట.

మంత్రి- అవునుప్రభు! సంతోషించదగినవిషయము.

జయ- ఛీ. విచారింపదగిన విషయము పృధ్వీరాజు జయించె నని విన్న సంతోషముగవుండి యుండెడిది.

మంత్రి- ప్రభువులు కోపముచే పలుకుచున్నారు కాని, పరదేశీ యుల పాలన అంగీకరించునంతటి మూర్ఖులు కారు. విదేశీయుడైన, తురుష్కుడొకడు భారత దేశమును కొల్లగొట్టినాడన్న, మనకుమాత్రము తలవంపులుగాదా! ప్రభు!

జ- నిజమేకాని, పృధ్వీరాజుపయి పగతీర్చుటయే నా ఆశ యము. అంతటితోకాని నాదవానలము ఆరిపోదు. పొరబాటు చేసితిని. నేను ఘోరీకి సహాయము చేసి యుండవలసినది.

మంత్రి— ప్రభూ! స్వార్థముకోసము దేశమును మంటగల్పుతారా?

జయ— దేశము, గీశము, నన్ను అవమానపరచిన నీచుని పగ సాధించుటే, నాపుద్దేశ్యము. యిప్పుడు మించిపోయిన దేమున్నది. తిరిగి యుద్ధముచేయుదమని ఆతనికి కబురింపుదును. యుద్ధరంగములో పృథ్వీరాజ్ కళేబరమును చూచినగాని, నా ఆవేదన చల్లారదు. ఇదిగో మంత్రి సత్తమా- నీనొక చిన్నపని చేయవలసియున్నది, ఢిల్లీ సేనాధిపతి హాసంగాలిరాయుడు నాకు చిరపరిచితుడు. ఆతనిని యెట్లయిన యిచ్చటకు వచ్చుటకు తగినసన్నాహములు చేయుము.

మం— రాజధురంధరా! ఆలోచించి, కార్యమును ప్రారంభించుడు, కడకు కుమారిసంయుక్త ముఖమయినచూచి మన్నింపుము.

జయ- నాకు కుమార్తె లేదు. నామాట తిరస్కరించి, నన్ను అవమానపరచి, నాయశోజ్యోతి విచ్ఛేదమునకు మూలమైన కులట. సంయుక్తనా మన్నించుట. మంత్రీ ఇందు నాకు యేమియు అడ్డము చెప్పవలదు. చాతనయిన చేయుము - లేదేని- నేనే స్వయముగ ప్రయత్నింతును.

మంత్రి- చిత్తము. దేవరవారి వుప్పుపులుసు తిని, అన్యథా ప్రవర్తింతునా?

తెరవాలును.

—o—

## ౩ రంగము

### 1 వ. దృశ్యము.

(మహమ్మద్ ఘోరీ రాజభవనము. ఘోరీ హుక్కా పీలుస్తూ కూర్చొనియుంటాడు. చుట్టూ భటులు వుంటారు. సేనాధిపతి జఫ్‌లఫ్ ఖాన్ ప్రక్కన ఆసీనుడయియుంటాడు.)

ఘోరీ— ఖాన్! చాలా అన్యాయం జరిగింది. తురుష్క ప్రభువులకు యుద్ధములో పరాజయమా! మనవాళ్ళు, ఆ సైన్యమును చూచి భయపడ్డారేకాని, గట్టిగాపోట్లాడితే కాఫరులు చిత్తయిపోయేవాళ్ళు.

జఫ్‌లఫ్—సర్కార్! యెన్ని చెప్పిన- రాజపుత్రుల క్రింద మనపని సున్న. కాఫిర్ కత్తి తిప్పుతుంటే, నాకి గుండెలు బరువెక్కాయి సర్కార్. అరె మనిసికన్నప్రాణ సర్కార్-ఈగ లాగ యెగిరిపోతుంటే- బేటాకి పట్టుకుండేది యెక్కడ సర్కార్.

ఘోరీ— అకే సైతాన్ —నీయెడ్డె కొట్టింది. లేకపోతే, తప్పకుండా గెల్చేవాళ్ళమే-ఘజ్నీ చూడు-భారతదేశము మీదకు వెళ్ళాడు అంటే. ధనరాసులతో తిరిగివచ్చేవాడు.

జఫ్— జీ సర్కార్— కాని ఘజ్నీ ఒకడుఅయితే కబరస్తాన్ పోయేవాడు— రాజపుత్రులికి బుద్ధితక్కువవుండుట చేత సర్కార్, ఒకరికీ ఒకరు సహాయముచేయరు. అదిసందు చూచి మనవాళ్ళు యుద్ధముచేసి గెల్చారుసర్కార్.

ఘోరీ— యేమైననుసరే, మళ్ళీ దండయాత్రచేసి, భారతదేశరత్న గర్భమును కొల్లగొట్టి, మన ఖజానాలు నింపాలి. అందాక నాకునిద్దురపట్టదు. యీపర్యాయము అల్లా

మనకు సింహాసహాయము చేస్తాడు.

(భటుడు ప్రవేశించి)

సర్కార్, మీకొరకై, యెవడో కాఫరు వేచియున్నాడు.

ఘోరీ- అందర్ కు, బులావు,

కాఫి- సలామ్ ఘోరీ సర్కారు.

ఘోరీ- యెవడు నీవు.

కాఫి- మాది కనూజీ, జయచంద్రభూపాలుడు పంపగ వచ్చితిని. ప్రభువులకు యీవుత్తరమును అందజేయమని పంపినాడు.

ఘోరీ. (ఉత్తరము చేతికితీసుకొని-) మాకు మీభాష రాదు. యేమ్రివ్రాసాడో నీవేచదువుము.

కా- (ఉత్తరము విప్పి, చదువును.)

ఘోరీ సర్కారుకు సలాములు,

మీరు దండయాత్రచేసి ఓడిపోయి వెళ్ళినది మొదలు పృథ్వీరాజు గర్వితుడై మాబోటిచిన్నరాజుల వేధించుచున్నాడు, అతని బాధలసహింపలేక, మేమందరముకలిసి మీకు సహాయమొనర్చి, అతని మదమడంచ దలచినాము కాబట్టి మీరు యీసారి తగుసైన్యముతో వచ్చి, ఢిల్లీరాజ్యమును పట్టుకోవలసినదిగా ప్రార్థించుచున్నాము. మీరు యిచ్చటకురాగనే మాకు కబురుచేసినయెడల- నేనువచ్చి మీతో స్వయముగ మాట్లాడుదును.

మీ శ్రేయోభిలాషి

జయచంద్ర భూపాలుడు.

ఘోరీ- అచ్ఛాహై! ఖాన్. కాఫరుకు తగినమర్యాదల్ చేయి.

ఖాన్- మీరాజు మాకి మోసముచేయడుకదా.

కా- లేదు. బాబు (ఘోరీ నైపు జూచి) సర్కార్. నేను వెంటనే తిరిగిపోవలెను. మా ప్రభువు గోనమికేల విచ్చారు.

ఘోరీ- మేము వెంటనే తగుసేనలతో వస్తాము. మీరాజునుకూడా తగుజాగ్రత్తతో వుండమనిచెప్పుము. మేము అక్కడకు రాగనే కబురుచేస్తాము.

కా- సలాముసర్కారు- పోయి వస్తాను. (నిష్క్రమించును.)

## 2 వ దృశ్యము.

(ఢిల్లీ రాజభవనము. పృథ్వీరాజు -సంయుక్త ఆసీనులయి యుందురు.)

పృథ్వీ- దేవి! సంయుక్తా- మీతండ్రిగారు నాపయి పగసాధించుటకు, తురుష్కులతో కలియనున్నాడని వార్తలు వచ్చుచున్నవి! అవి యెంతవరకు నిజమో?

సం- యేమో! ప్రభు! యెందుకు నిజముకాకూడదు.

పృథ్వీ- అంతటి అవివేకియా?

సం- కన్నకూతురు, ప్రేమించి, వివాహమాడదలంచినందున కూతురుపై, అల్లునిపై కత్తికట్టుటకన్న అవివేకమేమిటి! ప్రభూ!

పృథ్వీ- కనూజీ రాజవంశమునకు, తీరని మచ్చయని అయిన తలంపడా?

సం. మూర్ఖచిత్తునకు, ఆవేళ మొచ్చిన తలంపులవు తావెక్కడిది ప్రభూ.

పృథ్వీ- కష్టసాధింపనెంచిన, తనకు తానయి యేల నావయిరాకూడదు.

సం- అందుకు తగని అసమర్థుడేకదా, అన్యుల సహాయము నపేక్షించునది.

పృథ్వీ- దేవి! నీవు వీరనారివి. నీమృదుమధుర వాక్యములనా హృదయకుహరము చల్లబడినది. ప్రశాంతమయిన నీముఖాంబుజము నాహృదయములో హత్తుకొందు నీవంటి భారత స్త్రీశిరోమణిని నివాహ మాడిన నాజీవితమే జీవితము ప్రియా - ఏది........

( భటుడు ప్రవేశించును. )

భటు- మహారాజా! హామ్మాలిరాయుడు లోనికి అనుజ్ఞకై వేచి యున్నాడు.

పృథ్వీ- సత్వరము లోనికిగొనిరమ్ము.

( సంయుక్త నిష్క్రమించును. )

హా- జయము మహారాజ జయము.

పృథ్వీ- సేనాధిప! విశేషములేమి.

హా- మునుపు యుద్ధరంగమున ఓడిపోయి పారిపోయిన తురుష్కునకు, మరలదండయాత్రకు వచ్చుటకు గుండె యెక్కడిది ప్రభూ!

పృథ్వీ- నిజమో! అబద్ధమో, కాని, జయచంద్రుడు అతనికి కబురంపెనని తెలియుచున్నది.

హా- యేమో నేనునమ్మజాలను! యెంత మూర్ఖుడయినను, స్వార్థముకొరకు దేశద్రోహమొనర్చునా?

పృథ్వీ- పోరబడుచున్నావు ఆవేశపరునకు యుక్తాయుక్త విచక్షణ యుండదు. ఆతనికి నాపై పగసాధించుటే, లక్ష్యము, తదుపరి ఫలితము ఆలోచించుట లేదు.

హా- ఏది యెట్లయిన దైవమున్నాడుకదా!

పృథ్వీ- సరియే- నీవు మరల రాజపుత్రులందరికి యీవార్త నెరిగింపుము. ప్రాణములనయిన త్యజించి దేశగౌరవమును కాపాడవలెనని కబురంపుము.

హా- జయచంద్రునకు కూడానా?

పృథ్వీ- అవును మనతప్పులేకుండ కబురంపుటయే మంచిది.

హా- అయిన నేనేపోయి విశేషము లరసివచ్చెదను. నాకు చిరపరిచితుడే, నాచేతనయినంతవరకు చెప్పిచూచెదను.

పృథ్వీ- ఘోరీ సైన్యముతో బయలుదేరినాడని వింటిమి. యీపాటికప్పుడే నగముదూరము వచ్చియుండును. మంచిదే, సేనాధిపా! మూర్ఖజయచంద్రునితో యెట్లు మసలుదువో, అతిజాగరూకుడవై తిరిగిరమ్ము.

హా- ప్రభూ! నాపై నీఅపారప్రేమ అట్లనిపించుచున్నది గాని, నాకేమియు భయములేదు. శెలవు.

## ౩ వ. దృశ్యము.

(కనోజి రాజభవనము. జయచంద్రుడు, ఢిల్లీసేనాధిపతి ఆసీనులయి యుందురు.)

హా- జయచంద్రా! నీవు పొరబడుచున్నావు.

జయ- నేను పొరబడుచున్నానని, నీవు వూహించుచున్నావు. అంతియేకాని, నేను పొరబడుటలేదు.

హా- పృథ్వీరాజుపై నీవింత ఆగ్రహించుటకుగల కారణమేమి?

జయ- కారణమా! నీకు తెలియదా?

హా- నీకుమార్తెను తెచ్చెననియా?

జయ- అవును. దొంగవగిది- యెత్తుకొనిపోయినాడు. మా రాజ వంశమునకు తీరని కళంకమును ఆపాదించినాడు.

హా- మీకు తెల్పియే తెచ్చెను గదా, ఆతనుచేసినది విరోచితము- అదియునుగాక- సంయుక్త అతనిని మనసార ప్రేమించినది, వరించినది, ఇందు పృథ్వీరాజు దోషమేమున్నది.

జయ- మేము చేయునదియు వీరోచితమే. పగసాధించుట క్షాత్ర ధర్మము కాదా?

హా- కాని, యిదియా ధర్మము- అన్య దేశీయుని అడుగులకు మడుగులొత్తుచు, స్వదేశీయుని సాధించుటయా క్షాత్రము. జయచంద్రా! తప్పటడుగులు వేయుచున్నావు. నీమూలమున మనభారత రాజపుత్ర వంశ గౌరవములన్నియు మంటకలియును.

జయ- యేనాడు, నాకుమారిని, నా సమక్షమున, పృథ్వీరాజు యెత్తుకొనిపోయెనో? ఆనాడే నా రాజవంశగౌరవము లన్నియు మంటకలిసెను. హాహూలిరాయ! నీవెంత

చెప్పినను నామనసు మారదు. నన్ను క్షమించవలెను. నాకొనప్రాపిరి వున్నంతవరకు ఆతనిపై పగసాధింతును. భగవంతుని సాక్షిగా ఇదినిశ్చయము. ఇందుకు తిరుగు లేదు.

హా— అయినసరే! రాణిసంయుక్త మీకు ఒక్కమాట చెప్ప మనినది. ఆలకింతువా!

జయ— ఆకళంకిని మాటయే నాకవసరములేదు. క్షమింపుము.

హా- నేచెప్పవలసినంతవరకు చెప్పితిని. తదుపరి నీ యిష్టము. బాగుగాయోచించి కర్తవ్యమును నిర్ణయించుకొనుము.

(నిష్క్రమించును.)

## 4 వ. దృశ్యము.

(ఘోరీసైన్యము బారులుతీరి వుంటవి. కొందరు రాజ పుత్రులు, జయచంద్రుడు, తురుష్కులతో కలుస్తారు, పృథ్వీ రాజు సైన్యములు కోలాహాలముగ వుంటవి. ఈ రణకోలాహా లము విన్న పృథ్వీరాజు యుద్ధరంగానికి బయలు దేరుతాడు.

(సంయుక్త పూలదండపళ్ళెరముతో ప్రవేశిస్తుంది.)

పృథ్వీ- దేవి. సంయుక్తా! యుద్ధరంగమున జయలక్ష్మి వరించు నట్లు నన్ను ఆశీర్వదించి పంపు

సం— సోమనాధీశ్వరుని కరుణాస్రవంతులు మనపయి పారునంత వరకు, జయలక్ష్మి మిమ్ము విడువజాలదు.

(కాళ్ళు కడగును- పూలహారము మెడలో వేయును. నొసట తిలకము పెట్టును.)

పృథ్వీ- దేవి- నీయిచ్ఛల మనోదీక్షయే నాఅంగరక్ష. ఇప్పటికే ఆలశ్యమయినది, పోయివచ్చెద.

సం- నమస్కరించును. భారతాంబ మిమ్ము వెన్నంటి కాపాడుగాక........

(ఘోరమైన యుద్ధము జరుగుతూవుంటుంది. యుద్ధ మధ్య భూమిలో, పృథ్వీరాజు, హాహూలిరాయుని ప్రవేశము.)

హా- ప్రభు! తురుష్కసైన్యములు - మన సైన్యము నకు రెండింతలుండును.

పృథ్వీ- సైన్య మంతయున్నను ధైర్యముండవలదా!

హా. సైన్యమును పురికొల్పి వచ్చెదను ప్రభూ!

పృథ్వీ- (తురుష్కుల నుగ్గుగావించుచున్న సైనికులమధ్య ప్రవేశించి) అహో! భారతవీరులారా! స్వార్థమును విడనాడుడు దేశగౌరవమును కాపాడుడు. ప్రాణములకై వెనుదీయకుడు- తురుష్కుల నుగ్గుగావింపుడు. శరీరములనిత్యములు. కీర్తిచంద్రికలు నిత్యములు. (అని లయకాల రుద్రునివలె తిరుగుచుండును.)

హా- తురుష్కసైన్యములు చెల్లాచెదరగుచున్నవి ప్రభూ- జయలక్ష్మి ఢిల్లీ సార్వభౌముని వరించినది.

(భటుడు ఆతురతగ ప్రవేశించి)

ప్రభూ! జయచంద్రుడు కోటలోనికి ప్రవేశించుటకు రహస్యమార్గముల వెతుకుచున్నాడు.

పృథ్వీ- సేనాధిపా! నీవు కొంత సైన్యముతో ఆతనిని యెదుర్కొనుము.

హా— శెలవు ప్రభూ! మీరు మాత్రము జాగ్రత్తగా మెలంగుడు.

(జయచంద్రుని సైన్యమును సమీపించి)

జయచంద్రా! హాసుంగాలిరాయుడను సేవించియుండగనే ఢిల్లీకోట కుడ్యముల దాటగలవా, దేశద్రోహీ- నిన్ను వధించి, ఆర్తకవాహినుల భారతాంబను అభిషేకింతును.

జయ— మిత్రమా! నీకు నాకు యేమి వైరము?

హా— నాప్రభువు పైని వైరము నాతోవైరము కాదా!

జయ— నీవు రాజపుత్రుడవయ్యు, నీకొక ప్రభువు యుండునా! ప్రభువుగ నీవేల ఢిల్లిని యేలరాదు.

హా— అధికారముకొరకు రాజద్రోహమొనరించ మందువా.

జయ— ఇందు రాజద్రోహమేమున్నది మిత్రమా. క్షత్రియుడవయ్యు, బ్రాహ్మణునియట్లు ధర్మపన్నాలు పల్కెదవేమి. ఇదిగో నామాట వింటివా, నేటికి ఢిల్లీరాజ్య సార్వభౌముడవు కాగలవు. మనదేశమును ఘోరీకి అప్పజెప్పనిదా దేశద్రోహము. పృధ్వీరాజనంతరము, ఘోరీని వచ్చినదారి నడిపింపక వదలుదుమా!

హా— నీవెన్ని చెప్పినను- నాహృదయము మాత్రము అట్టినీచ కార్యమునకు వొప్పుకొనుటకు శంకించుచున్నది.

(ఢిల్లి రాజమందిరము- సంయుక్త, సునీతాలుఆసీనులయి యుందురు. భటుడు ప్రవేశించును.)

సం— యుద్ధవిశేషములేమి.

భటు- అమ్మా! పోరు ఘోరముగా జరుగుచున్నది. మన సైన్యమును రెండుగా చీల్చి, ఒకభాగమును కోట ప్రవేశింప ప్రయత్నించెడి జయచంద్రునిపైకి పంపుటచే, మనసైన్యము సన్నగిల్లినది. తురుష్కబలము హెచ్చయినది. మనవీరులు ప్రాణముల తృణప్రాయముగ నెంచి యుద్ధము చేయుచున్నారు. కాని, తురుష్క సైన్యములు విడతలవిడతలవలె పెరుగుచున్నవి. మన సైన్యము నశించుచున్నది. జయము అసంభవమని దేవరవారు మీకు కబురంపినారు. రాజపుత్రవంశగౌరవముల కాపాడుకొను ప్రయత్నములో యుండుమని సందేశమంపినారు.

సం- హా! భారతవీరకిశోరమా! పృథ్వీరాజభూపాలచంద్రమా నిన్ను తిరిగి దర్శించెడి భాగ్యమే లేదా? ఓయీ! ఢిల్లీ సామ్రాజ్య సార్వభౌముని కీర్తిచంద్రికలకు యెట్టిలోపమును రానీయమని ప్రభువులకు చెప్పుము. సునీతీ! చితిని పేర్చి సిద్ధముగా యుంచుము. ఓయీ! యీవుత్తరమును మాతండ్రికి అందజేయుము (నిష్క్రమించును.)

జయచంద్రుని శిబిరము.

---

భటు- ఇచ్చట జయచంద్ర భూపాలుడెవరు?

జయ- ఎవరునీవు? నేనే.

భటు- మహారాజా! ఢిల్లీసామ్రాజ్యదేవేరి మీకీయుత్తరము పంపినది.

జయ— యేది?

భటు— చేతికిచ్చును.

జయ— ( విప్పి చదువును )

తండ్రీ!

నీవింత సంకుచితహృదయుడగుదువని నెప్పుడు తెలియ లేదు, నీవు రాజపుత్రవంశములో జనించిన ఒక పిరికిపందవు. స్వాతంత్ర్యము నీలో నశించినది. నీఅల్లునిపై పగసాధించుటకై అన్య దేశీయుని పాదములొత్తుటకు నీమనస్సెట్లు ఒప్పెను. నేనుగూడ రాజవంశము నీమూలకమున కళంకితమై, ఆచంద్రతారార్కము అపకీర్తికి గురియైనది, నీవంటి "దేశద్రోహిని" తండ్రియని పిలచినను మహాపాతకమే! నీయీర్ష్యా ఆవేశాలకు, నా పవిత్ర ప్రేమజీవితాన్ని, బలిచేయబోతున్నావు. ఇప్పటికైనను యోచించి ఆత్మగౌరవమును నిలువబెట్టుకొమ్ము.

ఇట్లు.

ఢిల్లీ సార్వభౌమురాలు.

(వెకిలిగ నవ్వుచు)

నాకోపము, పృథ్వీరాజు శత్రు శిబరమును కన్నులార గాంచినగాని చల్లారదు— ఓరీ యెవడురా?

భటు— ప్రభూ సెలవు.

జయా— నేను ఘోరీశిబరమునకు పోవుచున్నాను. నేనుయిక్కడ వున్నట్లుగనే మహమ్మాలిరాయునకు నమ్మకము కల్గించు చుండుము.

యుద్ధరంగములో పృథ్వీరాజుకు బలికాపోటు తగులును.

క్రిందికి వరుగును. జయచంద్రుడు కత్తితోరక బాకుతో పోరవ బోవును. వెనుకనుండి భటుడు ప్రవేశించి జయచంద్రుని పట్టుకొనును.

పృథ్వీ— ఆవేదనతో! మామా జయచంద్రా! ఇప్పుడయినను నీకక్షతీరెనా? ఆత్మగౌరవమును పాటింపక, తురుష్కునకు లోబడి దేశద్రోహివైతివి. నీమూలమున పవిత్రమైన ఢిల్లీసామ్రాజ్యము మహమ్మదీయుల వశము కాబోవుతున్నది. భారతాంబకు దాస్యశృంఖలను తగిలించావు. నిరపరాధి — ప్రేమమూర్తి — సంయుక్త కోపదవానలము నిన్ను దహించకమానదు. స్వార్థుడవై జాతికి తీరని మచ్చ కల్పించి, చరిత్రలో ద్రోహివిగా సృష్టించుకున్నావు- ఈర్ష్యా, అవివేకములతో అంధుడవయి, ఢిల్లీ, కనూజీరాజవంశముల మర్యాదలు మంట గల్పావు. భారతదేశములో, రాజపుత్రుల, చరిత్రహీనులుగ చేశావు. ఎప్పటికయిన పశ్చాత్తాప పడకమానవు.

..............

దేవి...దేవి...... సో మనాక్షీశ్వరా! ఎన్నిజన్మముల కయినా, భారతభూమి నా మాతృభూమిగ అగునట్లు ప్రసాదించు తండ్రీ — జై — స్వతంత్రభారతికి— జై !

—o—

# గ్రంథాలయాధ్యక్షులకు, విక్రేతలకు ఒక మనవి.

అయ్యా,

మాచే నూతనముగా ప్రారంభింపబడిన మా జనరల్ బుక్ స్టోర్సులో వివిధ సారస్వత గ్రంథములు, మత, ఆర్థిక, రాజకీయ, చారిత్రిక, వైజ్ఞానిక, వేదాంత గ్రంథములు తెలుగు హిందీ, ఆంగ్లభాషలలో లభ్యమగునట్లు ఏర్పాట్లు చేయబడినవి.

అన్ని కంపెనీలవారిచే నూతనముగా ప్రచురించబడిన ప్రతి గ్రంథము మావద్ద స్టాకులో నుంచుటకు ఏర్పాట్లు చేయబడినవి. ఇవిగాక వివిధ గ్రంథకర్తలచే ప్రచురింపబడిన గ్రంథములు పంపినచో మా షోరూములో నుంచి తగిన ప్రచారము చేయగలము.

లైబ్రరీ నిర్వాహకులు, సారస్వతాభిమానులు, విద్యాసంస్థలవారు తమకు కావలసిన గ్రంథములన్నిటిని ఒకేతావున సేకరించుటకు మేము చేసిన యీ యేర్పాటునకు ప్రోత్సాహము, చేయూత నిచ్చెదరని విశ్వసించుచున్నాము.

మా బుక్‌స్టోర్సు కొకపర్యాయము దయచేసి మీకు కావలసిన గ్రంథములన్నిటిని కొనవ ప్రార్థించుచున్నాము. మీ గ్రంథాలయమునకు కావలసిన గ్రంథములను గురించిన వివరములు మాకు వ్రాసినచో జవాబు వ్రాయుదుము. పోస్టుద్వారా పంపు ఆర్డరుకూడా వెనువెంటనే రైలుద్వారాగాని, పోస్టుద్వారాగాని పంపుదుము,

ఇట్లు

ఆంధ్రా బుక్ హౌస్,
జనరల్ బుక్ స్టోర్సు
అండు షో రూమ్, గుంటూరు.
ప్రొప్రయిటర్ : అమృతాదేవి.

# సాహిత్యలతా గ్రంథమాల ప్రచురణలు

శ్రీ కొమరవోలు నాగభూషణరావుగారి రచనలు

1 గూఢచారులు — 1, 2 భాగాలు

2 ప్రతారణము (పరిశోధక నవల)

3 హోమజ్వాల (నవల)

శ్రీ వావిలాల సోమయాజులుగారి రచనలు

1 వసంతసేన (నాటకం)

2 నాయకురాలు (నాటకం)

3 [illegible] (నాటకం)

## "అమరేంద్రగారి" రచనలు

1 ఆత్మజ్యోతి (కథలసంపుటి)

2 కలకాదుసుమా! (అనువాదాలు)

3 పంజరం (కథలసంపుటి)

4 చక్రవర్తి (రేడియో నాటికలు)

శ్రీ టి. వి. సీతారామారావుగారి రచన

సినిమాకథ

శ్రీ ఆచార్య కౌండిన్య భట్టుగారి రచన

1 అగ్నిజ్వాల

ఆంధ్రా బుక్ హౌస్

గుంటూరు